19.11.1993 శుక్రవారం, 10 పేజీలు, సంపుటి: 64. సంచిక: 47. విడిప్రతి: రు. 2.00 లు

Regd. No. HNL. 18

# జమీన్ రైతు

జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి, స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు






రెక్కలు విరిగి నేలరాలిన పక్షి వలె బురదలో కూరుక పోయిన విమానం; అత్యవసర ద్వారాలకమర్చి వుండే ఈ రబ్బరు జారుడు బండల ద్వారానే ప్రయాణీకులు క్రిందకు దూకింది!

# విచిత్రము.. విడ్డూరము.. ఈ విమాన ప్రమాదం

అందనంత ఎత్తున, కంటి చూపుకు అననంత దూరాన ఆకాశంలో విహారాలు చేసే విమానం హఠాత్తుగా నేల పైకి వాలిపోతే, రెక్కలు విరిగిన పక్షిలా రాలిపోతే ఆ దృశ్యం చూడడానికెంత బీభత్సంగా, భయోద్విగ్నంగా, భయదాశ్చర్య సమన్వితంగా వుంటుంది?

ఇండియన్ ఎయిర్ లైన్స్‌కు చెందిన అటువంటి లోహ విహంగం ఒకటి 15 తేది సోమవారం ఉదయం వెంకటగిరి, ఏర్పేడుల మధ్య పచ్చటి పొలాలలో నేలవాలింది. ప్రయాణీకులు, సిబ్బంది కలిసి 247 మంది వున్న ఈ విమానం, ఎగరడానికి శక్తి లేక; ముందుకు కదలడానికి ఇంధనం చాలక నిజంగా రెక్కలు విరిగిన పక్షి వలెనే నేలపై విరుచుక పడింది.

మద్రాసు నుంచి హైదరాబాదు మీదుగా ఢిల్లీకి వెళ్ల వలసిన విమానమది. నిర్ణీత సమయంలోనే మద్రాసులో బయల్దేరింది. హైదరాబాదు విమానాశ్రయంలో దిగడానికి క్రిందకు వచ్చింది. ఎయిర్ ట్రాఫిక్ కంట్రోలు సిబ్బంది ల్యాండింగ్‌కు గ్రీన్ సిగ్నల్ ఇచ్చారు. విమానాన్ని నేల నుంచి ఒకే కిలోమీటరు ఎత్తువరకు దించారు. మరొక ఐదు నిముషాలు అన్నీ సక్రమంగా వుండి వుంటే, ఎయిర్ పోర్టు రన్ వే పైకి సురక్షితంగా దిగి వుండేది. కాని, వున్నట్లుండి దట్టమైన మంచు తెర ఒకటి విమానాశ్రయాన్ని చుట్టు ముట్టింది. పైలట్‌కు రన్ వే కన్పడ లేదు. సివిల్ ఏవియేషన్ నిబంధనల ప్రకారం కనీసం 800 మీటర్ల ఎత్తు నుంచి కంటి చూపుకు నేల కన్పడే పరిస్థితిలోనే విమానాన్ని క్రిందకు దించాలి. ఆ సమయంలో 200 మీటర్ల దిగువకు వస్తే కాని, ఏమీ కన్పడే పరిస్థితి లేదు. నిబంధనల ప్రకారం మళ్లీ పైకి ఎగిరి పొమ్మని ఆదేశించారు పైలట్‌ను! తిరిగి మద్రాసుకు వెళ్లి పోదామనే ఉద్దేశ్యంతో విమానాన్ని వెనక్కు తిప్పాడతను.

దురదృష్టవశాత్తు ఆ సమయంలో రెక్కలకు ఉండే ఫ్లాప్‌లు, స్లాట్‌లు పని చేయలేదు. ల్యాండింగ్ కోసం వాటిని తెరిచిన పైలట్, మళ్లీ మూయలేక పోయాడు ఎన్ని మీటలు నొక్కినా అవి కదలనని మొరాయించాయి. ఫ్లాప్‌లు పని చేయనందు వల్ల విమానం ఎగరాల్సినంత ఎత్తుకు (దాదాపు 35 వేల అడుగులు) ఎగర లేక పోయింది. 17 వేల అడుగులలోనే నిలబడి పోయింది. ఈలోగా ఫ్లాప్‌లు పూర్తిగా క్రిందకు వాలిపోయాయి. అయస్కాంత మేదో పట్టి లాగినట్లు విమానం క్రిందకు జారిపోవడం మొదలు పెట్టింది. ఆ ఒత్తిడికి ఇంజన్లు పానకాల రాముడి వలె పెట్రోలును జుర్రుకోవడం మొదలు పెట్టాయి. హైదరాబాదు విమానాశ్రయం దగ్గరకు చేరిన సమయంలో 16 వేల లీటర్ల పెట్రోలు వుండింది. కాని సగం దూరం వచ్చేసరికి ట్యాంకు ఖాళీ అయ్యే ప్రమాదం కన్పడింది. మద్రాసు వరకు దాన్నినడపడం అసాధ్యం. తిరుపతిలో దించదామంటే అక్కడ రన్ వే పొడవు కేవలం 4500 అడుగులు. ఎయిర్ బస్ దిగాలంటే కనీసం 7000 అడుగుల రన్ వే కావాలి. అప్పటికే రిస్క్ తీసుకొని అక్కడ దింపడానికే నిర్ణయించి, విమానాన్ని ఆ వైపుకు త్రిప్పారు. కాని పెట్రోలు అక్కడికి చాలేట్లు కన్పడలేదు. తిరుపతి 30 నాటికల్ మైళ్ల దూరంలో వుంది. దిండిగల్ సైనిక విమానాశ్రయానికి మళ్లించడానికి ప్రయత్నించారు. అది అసాధ్యంగా కన్పించింది. అప్పటికి విమానం కడప సమీపంలో వుంది.

పైలట్ సాహసోపేతమైన నిర్ణయం తీసుకొని, ఎక్కడ అనువైన నేల వుంటే అక్కడ దించేయ డానికి ప్రయత్నించారు. అప్పటికి విమానం చెట్ల ఎత్తుకు దిగి పోయి వుంది. పైకి లేవడం లేదు; వ్యవధి లేదు. ఏది జరిగినా సెకండ్ల లోపల జరిగి పోవాలి. విమానం నాయుడు పేట సమీపించింది. కేవలం 3 వేల అడుగుల ఎత్తులో ఎగురుతున్న విమానానికి, మద్రాసు విమానాశ్రయానికి సంబంధాలు తెగిపోయాయి. అదృష్టవశాత్తు ఆ సమయంలో, ఆ ప్రాంతంలో ప్రయాణిస్తున్న మరొక ఇండియన్ ఎయిర్ లైన్స్ విమానం పైలట్ దీన్ని గుర్తించాడు. ఇద్దరి మధ్య సమాచార సంబంధాలు ఏర్పడినాయి. అత్యవ సరంగా క్రిందకు దింపేస్తున్నానని ఆ విమానంలోనికి వారికి చెప్పి, కన్పించిన పంట పొలంలోకి దించి వేశాడు పైలట్. హైటెన్షన్ విద్యుత్ తీగలు, బండరాళ్లు, కాలువల పై కట్టిన తూములను తప్పించుకొంటూ, ఇంజన్లలో వుండే



ప్రయాణీకుల పాలిట దేముడి వలె వ్యవహరించిన పైలట్ కెప్టెన్ భల్లా

శక్తి నంతటినీ వినియోగించి 132 నాట్‌లస్పీడ్‌తో వరిపొలంలోకి దిగింది విమానం. వారం రోజుల వానలతో పాటు అప్పుడే నారువేతకు సిద్ధం చేసిన కయ్యలు కావడంతో, ఆ బురద విమానానికి కుషన్ వలె ఉపకరించింది. ధబేలున మూతిభాగం నేలకు కొట్టుకొని

కొరవ 10 పేజీలో

## తారా. లోకం చేరబోయి తప్పించుకున్న తారలు

వెంకటగిరి సమీపంలో జరిగిన విమాన ప్రమాదమే ఒక అత్యద్భుత విశేషమైతే, అందులోని దాదాపు 70 మంది సినీ జీవులు సురక్షితంగా బయట పడడం ఇంకా ఆకర్షణీయమైన విషయం. ఆంధ్రకు సంబంధించినంత వరకు వీరి ప్రస్తావనే విమాన ప్రమాదం పట్ల ఆసక్తిని పెంచింది.

మద్రాసు నుంచి హైదరాబాదు షూటింగుల కోసం చిరంజీవి, బాలకృష్ణ, సుధాకర్, అల్లు రామలింగయ్య, విజయశాంతి, బ్రహ్మానందం, మాలశ్రీ, పరుచూరి, కామ్రేడ్స్ కృష్ణతదితర హేమాహేమీలంతా ఈ విమానం ఎక్కారు. దీపావళి పండుగ సెలవలకు మద్రాసులోని ఇళ్లకు వెళ్లి తిరుగు ప్రయాణమన్న మాట. అందువల్లే ఒక్క విమానంలో అందరూ ఎక్కారు.

తెరమీద వీర, శూర, ధీర రూపాలలో కన్పించే హీరోలు నిజ జీవితంలో ఎంత బేలగా, పిరికి తనంతో బ్రతుకుతారో తెలియ చెప్పింది చిత్రం. విమానం దూకగానే చిరంజీవి, అందరికంటే అధికంగా చలించి పోయి భయము, దుఃఖము ఆపుకోలేక తన మామ అల్లు రామలింగయ్యను పట్టుకొని భోరున ఏడ్చేశారట. లేడీ అమితాబ్ బచన్ విజయశాంతి స్త్రీ సహజ స్వభావ సిద్ధంగా కంట తడిపెట్టింది. బాలకృష్ణ కూడా కన్నీరు కార్చారు. విమానంలోని ఇతర ప్రయాణీకులే నయం - లోపలెంతగా గుండెలు గుబ గుబలాడినా పైకి గంభీరంగా కన్పించారు.

దర్శకుడు ఎస్.వి. కృష్ణారెడ్డి ఆ దుస్స్వప్నం నుంచి తేరుకున్న తర్వాత, తమకు బ్రతుకు బిక్ష పెట్టిన పైలట్ కెప్టెన్ భల్లాకు పది వేల రూపాయల పారితోషికం ప్రకటించారు.

ఇంకొక విశేషమేమిటంటే సినిమా నటులు ఎవ్వరూ తిరుపతి చేరిన తర్వాత తిరిగి వేరొక విమాన మెక్కడానికి ధైర్యం చేయలేక పోయారు. అందరూ తెలిసిన వారి కార్లు పిలిపించుకొని, మద్రాసుకు వెళ్లారు.

నిజ జీవితానికి, సినిమాకు ఎంత తేడా?

## యానాది బావను ముఖ్యమంత్రి ముద్దుగా 'నోరుమూయ్' అని మందలించారు!

# ముచ్చట పడబోతే మూతి కాలింది!

యానాది బావకు కోపం వచ్చింది. అక్కడా అక్కడా అనుకునేరు. సాక్షాత్తు ముఖ్యమంత్రి కోట్ల విజయ భాస్కర రెడ్డిగారి సమక్షంలోనే.

నెల్లూరు జిల్లా అతివృష్టి నష్టాలను వివరించి, జిల్లాకు సాయంచేయమని ముఖ్యమంత్రిని అడిగేందుకు జిల్లా మంత్రి యానాది రెడ్డిని వెంట బెట్టుకొని గవర్నమెంట్ విప్ సి.వి. శేషారెడ్డి, లోక్‌సభ సభ్యుడు మాగుంట సుబ్బరామి రెడ్డి, మాజీ మంత్రి మాదాల జానకిరామ్ ముఖ్యమంత్రి ఇంటికి వెళ్లారు. అయితే యానాదిరెడ్డి బయటే కూర్చొని మిగతా ముగ్గురిని ముఖ్యమంత్రితో మాట్లాడి రమ్మని పంపించారట. ప్రజా ప్రతినిధులు ముగ్గురూ వెళ్లి ముఖ్యమంత్రికి జిల్లాలో అధిక వర్షాల వల్ల జరిగిన నష్టాన్ని వివరించారు. ఈ సందర్భంగా ముఖ్యమంత్రికి ప్రజాప్రతినిధులకు మధ్య జరిగిన మాట కచేరి కాస్తంత వేడివేడిగానే వుంది.

తుఫాను సహాయక పనుల (సిఆర్‌జపి) ప్రణాళికలో నెల్లూరు జిల్లాను మాత్రం మినహాయించారని, ఇది చాలా అన్యాయమని జానకిరామ్ ముఖ్యమంత్రి దృష్టికి తెచ్చారు. ఈ విషయం తనకు తెలిదని, గతంలో కోస్తాతీరంలో సిఆర్‌జపి పనులు




ఎక్కువగా జరిగిన దృష్ట్యా ఈసారి ఆ ప్రాంతాల్లో కోతపెట్టి వుండవచ్చుని. అయినా నెల్లూరు జిల్లా మొత్తాన్ని మినహాయించటం జరగదని ముఖ్యమంత్రి హామీ ఇచ్చారట.

ఇంతలో సుబ్బరామి రెడ్డి అందుకొని జిల్లాలో రోడ్లస్థితి కదిలించారు. దానికి జానకిరామ్ స్పందించి జిల్లాలో 1978 నుంచి మెటల్ రోడ్లన్నీ గూడూరు డివిజన్‌కే వెళ్లాయని, వెనక బడిన రాపూరు, ఆత్మకూరు, ఉదయగిరి, ప్రాంతాలను నిర్లక్ష్యం చేశారని ముఖ్యమంత్రితో అన్నారట. 'దీనికి కారణం జిల్లాలో మంత్రి పదవులు చేసిన నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి, ఎన్. జనార్ధన రెడ్డి గూడూరు డివిజన్‌కు చెందిన వారు కావటం వల్ల రోడ్ల పనులన్నీ అక్కడే జరిగాయని జానకిరామ్ చెప్పారు. శేషారెడ్డి కూడా కల్పించుకొని సర్వేపల్లి నియోజక వర్గంలో కూడా రోడ్ల పరిస్థితి అధ్వాన్నంగా వుందని, గతంలో చెన్నారెడ్డి ముఖ్యమంత్రిగా వుండగా మంజూరైన రోడ్లు కూడా జనార్ధన రెడ్డి హయాంలో వెంకటగిరికి నడిచి వెళ్లి పోయాయని కనీసం మీరైనా న్యాయం చేయాలని ప్రాధేయ పూర్వకంగా అడిగాడట. దానికి ముఖ్యమంత్రి నవ్వుతూ "అదేంటి శేషారెడ్డి, నువ్వు జనార్దన రెడ్డికి చాలా ముఖ్యం కదా! జనార్దన రెడ్డి ముఖ్యమంత్రిగా వుండగానే చేయించుకొని వుండాల్సింది" అన్నారట. "ఏంచేస్తాంసార్! సేవ చేయటమే కానీ, శాసించే హక్కు

> "జనార్దన రెడ్డి మూడేళ్లు అధికారంలో వుంటాడనుకొన్నాం; అప్పుడే దిగి పోతాడను కోలేదు"
>
> -మాదాల జానకిరాం

> "సేవ చేయడం తప్ప, శాసించే హక్కు మాకెక్కడిది; మా నిధులన్నీ జనార్దన రెడ్డి తరలించుక పోయాడు"
>
> -సి.వి. శేషారెడ్డి

మాకెక్కడిది. అప్పుడు జనార్దన రెడ్డి గారిని అడిగాం; ఆయన చేయలేదు. ఇప్పుడు మిమ్మల్ని అడుగుతున్నాం; ఆపై మీదయ" అని శేషారెడ్డి అనగానే జానకిరామ్ అందుకొని "జనార్దన రెడ్డి మరో మూడేళ్లు వుంటాడని అనుకున్నాం కానీ అప్పుడే దిగిపోతాడనుకో లేదు. ముందు గూడూరు డివిజన్‌లో పనులు పూర్తిచేసి ఆ తర్వాత మా నియోజక వర్గాలకు వస్తాడను కున్నాం ఇంతలోనే ఆయన దిగిపోయాడు" అన్నాడట.

ఇంతలో తనను ఎవరో పిల్చినట్లు భ్రమపడి బయట కూర్చొని వున్న యానాదిరెడ్డి లోపలికి వచ్చి చర్చలో వేలుపెట్టాడట. లోపల ఏ సంభాషణ జరుగుతున్నదీ తెలుసుకో కుండా "అది కాదుసార్ ! మీకో చిన్న విషయం చెప్పాలి; జనార్దన రెడ్డి ముఖ్యమంత్రిగా వున్నప్పుడు కోటాను కోట్లు నెల్లూరు జిల్లాకు

( కారవ 6 వ పేజిలో )



# పెంచలకోనలో తలదాచుకోను నీడ కల్పించండి ప్రభువులూ!

పుణ్యక్షేత్రమైన పెంచలకోన లోని నరసింహస్వామిని దర్శించేందుకు వెళ్తున్న భక్తులు కనీస సౌకర్యాలు లేక పడరాని పాట్లు పడుతున్నారు. స్వామిని దర్శించేందుకు వచ్చే భక్తుల సంఖ్య ప్రతి రోజు కన్నా శనివారం ఎక్కువగా వుంటుంది. కాని రాత్రివేళ బస చేసేందుకు ఒక్క రూమ్ అయినా లేక పోవడంతో అప్పటి కప్పుడే తిరుగు ప్రయాణం కావల్సి వస్తున్నది. దర్శనానికి వెళ్లేముందు భక్తులు స్నాన మాచరించడం పరిపాటి. ఇక్కడ స్నానపు గదులు ప్రత్యేకంగా నిర్మించక పోవడం వల్ల కొళాయిలు, బావుల వద్ద స్నానచేయాల్సి వస్తూంది . ఇటీవల కట్టిన స్త్రీల స్నానపు గదులకు తలుపులు లేక వారు ఇబ్బందులు పడుతున్నారు. బ్రహ్మోత్సవాల సమయాల్లో ఈ ఇబ్బంది మరీ జాస్తి! బావుల్లో పూడిక తీయించక పోవడం వల్ల నీరు కూడా అంతంత మాత్రంగానే వుంటున్నది.

కోనలో భక్తుల సౌకర్యార్థం 18 గదుల వసతి గృహం నిర్మించి ప్రారంభోత్సవం జరిపిస్తానన్న పాలక వర్గం అధ్యక్షులు తన మాటను నిలబెట్టు కోలేక పోయారు. ప్రస్తుతం ఆపని మొండిగోడల వరకే పరిమిత మయ్యింది. ఇంకొక ప్రక్క టోల్ గేట్ పేరుతో ఊడును రోడ్డుకు అడ్డంగా కట్టి ద్విచక్ర వాహనాలు, కార్లలో వచ్చే భక్తులను దోచుకుంటున్నారు. సౌకర్యాలు కల్పించడంలో విఫలమైన పాలక వర్గం టోల్ గేట్ దోపిడీ నైనా అరికడితే భక్తులు సంతోషిస్తారు.

### నరకానికి దారి అల్లూరు రహదారి

రాజుపాళెం నుంచి అల్లూరు వరకు బస్సు ప్రయాణం నరకాన్ని




తలపిస్తుంది. డబుల్ రోడ్డు కోసం చేపట్టిన కల్వర్టుల నిర్మాణాలకు తోడుగా రోడ్డు పక్కల మార్జిన్లు త్రవ్వివేయడంతో ఇటీవల వర్షాలకు పరిస్థితి మరీ దారుణంగా తయారయ్యింది. గుండాలమ్మ పాళెం - కొడవలూరు మధ్య రోడ్డు పాడైపోయి పెద్ద పెద్ద గుంటలు పడిపోయింది. గుండాలమ్మ పాళెం దేవాలయానికి ముందు బస్ యాక్సిల్‌కు తగిలేంతగా రోడ్డు చెడింది. నెల రోజులుగా కార్లు, స్కూటర్లు ఈ మార్గాన పోవడం మానుకున్నా ఆర్అండ్‌బి అధికార్లు దీన్ని పూడ్చిన పాపాన పోలేదు. పద్మనాభ సత్రం, తలమంచి, బసవాయపాళెం మధ్య రోడ్డు మార్జిన్ తవ్వడంతో ఎదురెదురుగా వాహనాలు నడువలేక పోతున్నాయి. కల్వర్టుల నిర్మాణం కోసం వేసిన డైవర్షన్లు అధ్వాన్నంగా వుండడంతో వర్షాలకు బస్సులు దిగబడి పోతుండడంతో రవాణా సౌకర్యం నిలిచిపోయింది. రాజుపాళెం నుంచి ఇస్కపల్లి వరకు అల్లూరు మీదుగా సాగే ఈ రోడ్డును 2 సంవత్సరాల క్రితమే వేశారు. కాని అది వెంటనే అధ్వాన్నస్థితికి చేరుకుంది. ఇటీవలే వచ్చిన డబుల్ రోడ్డు ప్రతిపాదన ఆ అవినీతిని కప్పి పుచ్చింది. నిత్యం వేలాది మంది ప్రజలు ఈ గతుకుల రోడ్డులో ప్రాణాలు అర చేతిలో పెట్టుకొని పోవాల్సి వస్తున్నది. ఈ దరిద్రపు రోడ్డులో 28 కిలో మీటర్ల దూరంలో వున్న నెల్లూరు చేరాలంటే రెండు గంటలు పైగా పడుతున్నది. వర్షాలకు కొత్త డబల్ రోడ్డు పనులు అంతంత మాత్రంగా చేస్తూ, ఇబ్బంది పెట్టూ ప్రాణాలు తోడడం కంటే, వాన నిలిచాక చేపట్టమని ప్రజలు కోరుతున్నారు.

( కారవ 6 వ పేజిలో )

# జమీన్ రైతు

## దర్గా లొంగుబాటు!

హజరత్ బాల్ సమస్య సామరస్యంగా పరిష్కారమైంది. 31 రోజుల ముట్టడి తర్వాత భారతీయ సైన్యం దర్గాలోపలున్న మిలిటెంట్లను లొంగదీయ గల్గింది. ఒక్క బుల్లెట్ పేల్చకుండా, ఒక్క రక్తపు బొట్టు నేల చిందకుండా సున్నితము, సంక్లిష్టము అయిన ఈ సమస్యను ఎంతో సంయమనంతో పరిష్కరించిన సైన్యాన్ని, ప్రభుత్వాన్ని అభినందించాలి.

అక్టోబరు 15 తేది, సైన్యం చేతికి చిక్కకుండా తప్పించుకునే ఉద్దేశ్యంతో తీవ్రవాదులు ఈ దర్గాను దురాక్రమించారు. స్వర్ణదేవాలయం,బాబ్రీమసీదు అనుభవాలతో ప్రభుత్వం దర్గాలోపలకు సైన్యాన్ని పంపే సాహసం చేయదన్నది వారి ధైర్యం. కాని సైన్యం ఎంతో దూరదృష్టితో, పటిష్టమైన వ్యూహంతో దర్గాను ముట్టడించింది. సైన్యానికి ధీటుగా, ప్రభుత్వం దృఢమైన రాజకీయ నిర్ణయం తీసుకొని వుంటే పరిస్థితి వేరుగా వుండేది. కాని, పి.వి. తటపటాయింపు వైఖరిని అవలంబించారు. ఈ నాన్పుడు ధోరణిని పాకిస్తాన్ తనకనుకూలంగా మల్చుకున్నది. దీన్నొక అంతర్జాతీయ సమస్యగా మార్చి, ఆగం చేసింది. ఇస్లామిక్ కాన్ఫరెన్స్ కూడా వేలు పెట్టింది. ఈ లోగా అమెరికా కుటిల బుద్ధితో అసలు కాశ్మీర్ భారతదేశంలో అంతర్భాగం కాదేమోనన్న వక్రప్రకటన చేసింది. తీవ్రవాదుల ముఠా అనదగిన హరియత్ కాన్ఫరెన్స్‌ను సంప్రదింపులకు ఆహ్వానించడంతో, వారు ఆ సాకు పెట్టుకొని లోపలకు వెళ్లి మిలిటెంట్లతో చర్చలు జరిపి, సంబంధితులకు ఆ సమాచార మందించి, సమస్యను మరింత క్లిష్టతరం చేశారు. ఇంకొక ప్రక్క వారే కాశ్మీర్ హైకోర్టులో రిట్ దాఖలు చేసి దర్గాలోపలకు ఆహారం, దుప్పట్లు, వైద్య సహాయం పంపగల్గారు. దర్గా దురాక్రమణ దారులకు రాచమర్యాదలు చేయవలసి వచ్చింది. వళ్లు గడ్డ కట్టించే చలిలో నిద్రాహారాలు లేకుండా సైనికులు కళ్లలో వత్తులు వేసుకొని దర్గాకు కాపలా వుండవలసి వస్తే, ప్రభుత్వ అసమర్థత వల్ల దర్గాలోపలి తీవ్రవాదులు పుష్టిగా పలావులు, పండ్లు ఆరగించి, వెచ్చగా నిద్రపోయారు.

అదృష్ట వశాత్తు సుప్రీంకోర్టు ఆహార సరఫరా విషయంలో కాశ్మీర్ హైకోర్టు తీర్పును మార్పు చేసి, దర్గావెలుపల, కంచెదగ్గర మాత్రమే ఒక్కొక్కరికి పరిమిత పరిమాణంలో ఆహారం అందివ్వాలని ఆదేశించడంతో సైన్యానికి ఊపిరి పీల్చుకునే వసతి కల్గింది. కంచె దగ్గర సైన్యం వుంటుంది. ఎవరైనా అక్కడికి వచ్చి తినాలి. తిండికోసం వస్తే తమ గుర్తింపు తెలిసి పోతుంది. తిండి లేకుండా ఎంతకాలం వూరకుంటారు? స్వతంత్ర కాశ్మీర్ కోసం ప్రాణాలర్పిస్తాం అని బీరాలు పల్కే ఈ దేశద్రోహులు ఆకలికి తట్టుకోలేక శరణు శరణు అంటూ లొంగిపోయారు. కథ సుఖాంతమైంది.

చివరలో కూడా ప్రభుత్వం వెన్నెముక లేనిదానివలె వ్యవహరించడం శోచనీయం. ఎంతో సహనంతో, సాహసంతో ఇన్ని రోజులపాటు దర్గాను కాపాడిన సైన్యాన్ని విస్మరించి, మిలిటెంట్ల కోరిక ప్రకారం కాశ్మీర్ పోలీసులకు లొంగుబాటు బాధ్యతను అప్పచెప్పారు. ఇది సైన్యాన్ని అవమానించడం క్రిందే లెక్క, అందువల్లే బిజెపి నాయకులు ప్రభుత్వాన్ని నిలదీస్తున్నారు - మీరు మిలిటెంట్లకు లొంగిపోయారా లేక మిలిటెంట్లు మీకు లొంగి వచ్చారా అని! మిలిటెంట్లు, ప్రభుత్వానికి మధ్య ఏదో ఒప్పందం జరిగిందని, దాని ప్రకారం తీవ్రవాదులందరినీ విడిచి పెట్టనున్నారని ఒక వదంతి వుంది. అదే నిజమైతే మాత్రం ఢిల్లీ దొరలు దేశానికి తీవ్రమైన ద్రోహం చేసిన వారౌతారు. ఏ తీవ్రవాదులను పట్టుకోవడానికి సైన్యాన్ని వినియోగించి, కోట్లు ఖర్చు పెట్టి ప్రయత్నిస్తున్నారో, వారు చేతికి చిక్కిన తర్వాత వదలి పెట్టడం కంటె ద్రోహం ఏమి వుంటుంది?

ఎట్లయితేనేమి, శాంతియుతంగా ఈ సమస్య పరిష్కారం కావడం వల్ల అంతర్జాతీయంగా భారతదేశ కీర్తి ప్రతిష్టలు మెరుగౌతాయి. ఈ అవకాశాన్ని వినియోగించుకొని ముస్లిం దేశాలలో కాశ్మీర్ పట్ల వున్న అపోహలు తొలగించే బాధ్యత ప్రభుత్వం పై వుంది. మతం పేరుతో పాకిస్తాన్ ఇస్లాం మతానికి చేస్తున్న అపచారాన్ని లోకానికి వెల్లడి చేయాలి! మహమ్మద్ ప్రవక్త పవిత్ర కేశం వున్న దర్గా లోపల తీవ్రవాదులు ఆయుధాలతో తిష్ట వేయడం, మలమూత్ర విసర్జనలతో ఆ పవిత్ర ప్రదేశాన్ని అపవిత్రం చేయడం ఇస్లాం మతం పట్ల భక్తి వున్న వారు ప్రోత్సహించ దగిన పనేనా? పాకిస్తాన్‌కు నిజంగా మతం పట్ల శ్రద్ధ వుంటే తన ఏజెంట్లను పంపి ఈ అపవిత్ర కార్యక్రమాలు ప్రోత్సహిస్తుందా? లోపల దొరికిన వారి గూఢచారులు, ఆయుధాలను బహిర్గతం చేసి పాకిస్తాన్ దుర్మార్గాన్ని లోకానికి వెల్లడి చేయాలి! అమెరికాకూ బుద్ధి చెప్పాలి! అంత మాత్రం రాజకీయ విజ్ఞత; సాహసం మన పివి ప్రభుత్వానికి వున్నాయా అన్నది సందేహమే!

# జమీన్ రైతు

19.11.1943

వెల 0-1-6

## గ్రామసీమలు

### కావలి

సక్కాలాయి క్షామనిధికేనా? :- క్షామనిధికని కంట్రాక్టరు వద్ద రు. 70 లు తీసుకొని యువజన సంఘం సహాయం చేసింది. చూడండి! ఒక రూపాయ వసూలు జేస్తే యిందులో 0-3-0 క్షామనిధి కరుపులో బడ్డది. తక్కిన 0-13-0 లు కంట్రాక్టుదారు జేబులో బడ్డది. అంతకంటే ప్రత్యేకంగా చేసుకుంటే ఎంత బాగుండేది?

\- పరిశీలకుడు

### పొట్టెంపాడు రోడ్డు

మావూరి కెగుదల చెరువు లన్నీ తెగి మారోడ్డు మీదబడి రోడ్డు బొత్తుగా చెడిపోయింది. జిల్లాబోర్డు వారు తక్షణం తన్కీ చేయించి రిపేరు చేయించ కోరుతున్నాము.

\- పౌరుడు

### కాలేజి విద్యార్థుల మొర

పోయిన సంవత్సరం వి.ఆర్. కాలేజిలో సైన్సు స్టూడెంట్లను ఊర్లో 0-12-0 రికార్డులు పుస్తకాలు అమ్ముతూవుంటే 1-2-0 కు కాలేజి స్టోర్సులో నిర్బంధంగా కొనమన్నారు. అప్పుడు గ్రాఫ్ పేపర్లు పుస్తకంలో కూడా లేవే అంటే కావలసినప్పుడు సప్లయి చేస్తాం అన్నారు. పోయిన సంవత్సరంలో గ్రాపులు వేయుటకు ఒక బాచి (Batch) కి ఒకటి. ఇంకొక దానికి రెండు ఇచ్చినారు. ఈ సంవత్సరం అదీ కూడా లేదు. గ్రాఫువేయు లేదని డిమాన్‌స్ట్రేటర్లు రిమార్కులు రాస్తారు. గ్రాఫు పేపరు అడిగితే నాకివ్వలేదు మీకిచ్చేందు కంటాడు. దాన్నిగూర్చి అప్పుడు చెప్పిన వాళ్ళను అడిగితే మౌనం వహిస్తారు. ఏం చేసేది మా కర్మ ఊళ్ళోగూడా దొరకటం లేదు.

\- సీనియరు విద్యార్థి.

### వెధవ చింతకాయ లెంత చేసినాయి?

400 రూ విలువ గల వాటిని 25 రూ.కు బహిరంగ అనబడు గుప్తవేలము!

### బ్రహ్మాణైన పుట్టు రిమ్మ తెగులు!

యుద్ధం పుణ్యమా అంటూ చింతపండు బాగా గిరాకీ అయింది. ఇందుమూలన్నే, చింతకాయల వేలం పాట, గిండిరేసు స్పీడును మించిపోతూన్నది.

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

గుంటూరు జిల్లాలో ఈయేడు చింతకాయల పాటల పుణ్యమా అంటూ, చాలా మంది జిల్లాబోర్డు రేంజి ఆఫీసర్లు సంతుష్టులయ్యారు. కాని రగడపాలయిన పెద్ద మనుష్యులనే వుద్యోగస్థులూ లేక పోలేదు వారిలో కాయలు కోసే హక్కు బహిరంగంగా వేలం జరపాలని జిల్లా బోర్డు స్పెషల్ ఆఫీసరు ఆర్డరు వేసినా, పొన్నూరు రేంజి స్పెషల్ ఆఫీసర్ గారు బహిరంగ మనబడు రహస్య వేలము ద్వారా 25 రూ.కు400 రూ. మించిన పాటరాగల చింత చెట్ల కాయలు కోసేహక్కును యే సుముహూర్తాన యిచ్చారో గానీ, అదంతా ఒక రాద్ధాంతమయింది.

"బహిరంగ వేలం జరగలేదండో ప్రభువరా!" అంటూ స్పెషల్ ఆఫీసరు వారి ఆఫీసులో అర్జీల వర్షం కురిసింది. దాంతో మూలవిరాటు కదిలారు. తిరిగి వేలం జరగాలని ఉత్తరువు జారీ అయింది. 9 తేదిన వేలము అని అందు కుద్యుక్తులగు వారంతా రంగస్థలంలో నిలబడ్డారు. కానీ యింతలోనే "25 రూ. పాటదారు 250 రూ. యిస్తానన్నారు కాబట్టి వేలం నిలిపివేయండి" అంటూ స్పెషల్ ఆఫీసరు నుంచి రేంజి ఆఫీసరుకు మరోవుత్తరువు యేశక్తి ప్రభావం వల్లో వచ్చింది!

దాంతో తుఫాన్ చెలరేగింది. అది స్పెషల్ ఆఫీసరు మీదనే. లోకల్ బోర్డు యిన్‌స్పెక్టరు ఆఫీసును టెలిగ్రాములు ఆవరించాయి. రానున్న ఉపద్రవాన్ని స్పెషల్ ఆఫీసరు అపుడు గుర్తించాడు. "400 రూ. మించి గూడ పాడుతామంటున్నారు కాబట్టి 400 రూ. డిపాజిటు చెయ్యండి పాట త్వరలో యేర్పరుస్తాం" అని స్పెషలాఫీసరు అన్నాడు.

పోటీదారులు బొబ్బిలి బెబ్బులు లాగా వెనుక చూపులేకుండా సంగ్రామోత్సాహంలో ముందుకు పోతూనే వున్నారు.

గమ్యస్థానం వుందదా? చింత పండు ధర కంట్రోలు చేస్తే యేమవుతుంది? వెనుక ముందులు చూచి మరీ గోదాలోకి దిగండి.

(ఒ.వి.)

కొరవ 8 పేజీలో

# న్యాయమూర్తులనూ పరీక్షలు పెట్టి నియమించాలి!

ధర్మదేవత, కళ్లకు గంత కట్టి, ధర్మ కాటా చేతికిచ్చి న్యాయ నిర్ణయం చేయమన్నారు నాడు. నేడు దేవత అవ్యక్తమైన చలన చిత్ర తెరకు పరిమితమై పోయింది. కళ్లు తెరచి, న్యాయ నిర్ణయం జరుగుతున్నది నేడు. అందుకే ప్రజా విశ్వాసాన్ని కోల్పోతుంది.

మన రాజ్యాంగంలో న్యాయ వ్యవస్థకూ ఉన్నత స్థాన మేర్పరచి వున్నారు. ప్రజా ప్రభుత్వ సౌధానికి మూలస్థంభం న్యాయవ్యవస్థ నిలిచింది.

కాని నేడు ప్రజా విశ్వాసాన్ని పోగొట్టు కొంటున్నదను విషయం వివాద రహితం. ఇందుకు కారకులెవరు? న్యాయ నిర్ణయ విధానమా? న్యాయమూర్తులా? న్యాయవాదులా? ప్రజా పాలకులా? లేక ప్రజలా? ఎందుకు వృత్తి స్థాయి దిగజారింది?

న్యాయనిర్ణయ విధానాలు, న్యాయార్థికి సత్వర న్యాయ మందిచుటకు, కొంత వరకు "విధానాల ప్రక్రియ" ఆటంకాలే. న్యాయ స్థానములో అర్థి, ప్రత్యర్థి మధ్య వివాదము. న్యాయవాదులు వారి సహాయ కారులు. నాటి విధానాలు, నేటి కాల మార్పుకు, సరిపడుట లేదు. అందుచే న్యాయార్థి వ్యయ

- కొరవ 6 పేజీలో

## జనవాణి

# పనిచేయకుంటే పతనమే!

ఎన్నికల సంవత్సరంలోనికి కాంగ్రెస్ ప్రభుత్వం ఇక నెలలోనే అడుగిడ నుంది. ఈ ప్రభుత్వం ప్రజల సానుభూతి, ఆదరణ సంపాదించి, నెగ్గి నిలవాలంటే కొన్ని ప్రధాన నిర్ణయాలను ముఖ్యమంత్రి గారు తీసుకోవాలి. నిత్యావసర వస్తువుల ధరలు ఆకాశానికి అంటాయి. కొన్ని వస్తువుల ధరలు అడ్డూ అపు లేకుండా పెరిగితే వ్యవసాయో త్పత్తుల ధరలు పాతాళానికి దిగజారి రైతు బ్రతుకు నట్టేట మునుగుతూంది. ప్రతిపక్ష పార్టీల విమర్శలకన్నా స్వపక్షంలోనే విమర్శలు ఎక్కువయ్యాయి. లా అండ్ ఆర్డర్ అధోగతి వుంది. రాష్ట్ర రాజధానిలోనే పోలీస్ అధికారులకు సైతం రక్షణ లేదు. దీనికి తోడుగా టర్నోవర్ ట్యాక్స్. మునిసిపాలిటీలో పన్నుల పెంపు. ప్రభుత్వ ఆఫీసుల్లో లంచగొండి తనం తీవ్రంగా పెరిగి పోయాయి. వీటిని ముఖ్యమంత్రి అరికట్టక పోతే పార్టీ ఇక అధోగతే!

గూడూరు - ఆవుల కొండయ్య

# ఇరవై కోట్లిస్తే వాన నష్టం పూడ్చుకొంటాం!

### - ప్రభుత్వానికి జిల్లా మంత్రుల వినతి

జిల్లాలో ఇటీవల కురిసిన భారీ వర్షాలకు దెబ్బ తిన్న రోడ్లు, గండ్లు పడిన చెరువులు, సప్లయ్ ఛానల్స్, పొర్లు కట్టలు, డ్రైనేజీల మరమ్మత్తులకు 20 కోట్ల రూపాయలు మంజూరు చేయవలసిందిగా 16 తేది కలెక్టరేట్ లోని సైక్లోన్ మీటింగ్ హాలులో జరిగిన జిల్లా ప్రణాళికా అభివృద్ధి సమీక్షా మండలి సమావేశం ప్రతిపాదించింది - జిల్లా ఇన్‌ఛార్జి మంత్రి శ్రీ పి. సాంబశివ రాజు అధ్యక్షతన జరిగిన సమావేశంలో తాత్కాలిక మరమ్మత్తులకు గాను తక్షణం 4 కోట్లు మంజూరు చేయ వలసినదిగా సమావేశంలో పాల్గొన్న శాసన సభ్యులందరితో పాటు జిల్లా మంత్రులిద్దరూ ముక్తకంఠంతో కోరారు. కురిసిన కొద్ది పాటి వర్షానికే దెబ్బ తిన్న ప్రపంచ బ్యాంకు నిధులతో చేపట్టిన రోడ్ల నిర్మాణపు పని తీరు పై శాసన సభ్యులు శ్రీయుతులు మాదాల జానకి రాం, జె.కె. రెడ్డి, సి.వి. శేషారెడ్డి, ప్రసన్న కుమార్ రెడ్డి ధ్వజమెత్తడంతో అధికార వర్గం విస్తుపోయింది. కాంట్రాక్టర్ల పై తగిన చర్యలు తీసుకోకుంటే ఈ తప్పుడు విధానం అడ్డు అపు లేకుండా సాగి పోతుందన్నారు ఎమ్మెల్యేలంతా. ఎమ్మెల్యేల ఫిర్యాదు పై సమావేశంలో వున్న రాష్ట్ర రెవిన్యూ మంత్రి కె. రామిరెడ్డి రోడ్లు భవనాల శాఖ ఎస్.ఇ. పై మండిపడడం ఆయన గారు కుంటి సాకులు చెప్పి సర్దిచెప్పడం జరిగిందట. మంత్రి గారు సకాలంలో ముందు జాగ్రత్తలు తీసుకొన్న అధికార వర్గాన్ని అభినందించారు. గృహ నిర్మాణ శాఖ మంత్రి శ్రీ పసల పెంచలయ్య లోతట్టు ప్రాంతాలలో నిర్మించేందుకు 5 వేల గృహాలను జిల్లాకు ప్రభుత్వం మంజూరు చేయాలన్నారు. సహకార మంత్రి శ్రీ కలికి యానాది రెడ్డి పంట నష్టపోయిన రైతులకు ఎరువులు క్రిమి సంహారక మందులు సబ్సిడీ రేట్లతో సరఫరా చేయాలని కోరారు. జిల్లాలో జరిగిన నష్టాలు, తీసుకొన్న సహాయ పునరావాస కార్యక్రమాలను సమావేశంలో జిల్లా కలెక్టర్ శ్రీ ఎం. సాంబశివ రావు వివరించారు. మంత్రులు, శాసన సభ్యులు పౌరసంబంధ శాఖ నష్టాలపై సైక్లోన

కొరవ 9 పేజీలో

ఇందిరా భవన్‌లో ఇందిరమ్మ వర్ధంతి సందర్భంగా రిక్షాలు పంపిణీ చేస్తున్న సహకార శాఖ మంత్రి కలికి యానాదిరెడ్డి, డి.సి.సి అధ్యక్షులు ఆనం సంజీవరెడ్డి, యూత్ కాంగ్రెస్ నాయకులు దేవకుమార్‌రెడ్డి, సునీల్ కుమార్ రెడ్డి, రాఘవరెడ్డి.

# లాటరీలు పోయి చీటీలొచ్చాయి- పోలీసు మామూళ్లలోటు తీర్చాయి!

కొండవాలుకకు మందు వేస్తే వున్న వాలుక పూడిందట. డైలీ లాటరీల విషయంలో పోలీసుల యుద్ధం అట్లావుంది. ప్రజలను హిప్నటైజ్ చేసి, వారిని హిస్టీరియా రోగులుగా మార్చి, వారి కాపురాలు కూల్చి, కోట్లాది రూపాయలు కొల్లగొట్టుకొని పోతుండిన డైలీ లాటరీలపై నెల్లూరులో పెద్ద ఆందోళనే జరిగింది. పోలీసులూ కొంత కఠినంగా వ్యవహరించి అణచి వేశారు. ఆ పీడ అంతటితో విరగ డైనందను కున్నాము. కాని రక్తం మరిగిన పులి వేట మానుతుందా? అమాయకుల రక్త మాంసాలను రూపాయి నోట్లుగా మల్చుకొని పెట్టెలు నింపుకునే నీచ వ్యాపారులు తమ ధన దాహం మానుకోగలరా ? డైలీ లాటరీలు పోగానే వారు అదే జూదాన్ని మరొక రూపంలో, మరింత అనధికారిక వేషంలో ప్రవేశ పెట్టారు. లాటరీలు నడిస్తే ప్రభుత్వానికి కొద్దిగాన్నా పన్ను అయినా వస్తుంది; దీనివల్ల అదీ రాదు.

ఈ జూదానికి పేరు కూడా లేదు. చీటీల పేరుతో జరుగుతున్నదిది. లాటరీ వ్యాపారులు అక్కడక్కడా సెంటర్లు తెరిచారు. ఆ సెంటర్లలో ఒక గుమాస్తా చిన్న చిత్తు కాగితాలు కట్ట పెట్టుకొని వుంటాడు. వెర్రి జనం ఒక్కచీటి 10 రూపాయలు, 20 రూపాయలు లెక్కన కొంటారు. కొనేవారు అడిగిన నంబరు ఆ చీటి పైన వ్రాసి ఇస్తారు. 1 నుంచి 10 లోపల సింగిల్ నంబరు కాని, 1 నుంచి 100 లోపల డబుల్ నంబర్ కాని వ్రాస్తారు. వర్తకి హాలు, మూలపేట, సంతపేట, లస్సి సెంటర్, మద్రాసు బస్టాండు, దర్గామిట్ట, కరెంటాఫీసు కూడలి వంటి చోట్ల ఈ చీటీల అమ్మకాలు జరుగుతున్నాయి. భూటాన్, భాగ్యలక్ష్మి వంటి దగాకోరు లాటరీల ఫలితాలకు, ఈ చీటీలకు లింకు వుంటుంది. ప్రక్కరోజు పత్రికలలో ఆయా లాటరీలు ప్రకటించే ఫలితాలు ఆధారంగా సింగిల్, డబల్ డిజిట్ చీటీలకు బహుమతు లిస్తారు. నంబరు తగిల్తే 8 రెట్లు ఇస్తారట. అత్యాశకు పోయి వేలాది మంది అమాయకులు ఈ చీటీల జూదానికి బానిసలుగా మారుతున్నారు; దీపం ముందు పురుగుల్లాగా గుమికూడి మాడి పోతున్నారు.

> **పోలీసుల రక్షణలో డైలీ చీటీలు ప్రజలను పీల్చి పిప్పి చేస్తున్నాయి!**

ఏ పోలీసు అధికారీ ఈ చీటీల జూదాన్ని నివారించడానికి ప్రయత్నించడం లేదు. టౌన్‌లోని అన్ని స్టేషన్‌లకు, ఈ మోసపు వ్యాపారులకు సంబంధాలు, నెల మామూళ్లు వున్నాయి. తమ జోలికి రాకుండా వుండడం కోసం వీరు స్టేషన్‌కు నెలకు 30వేల రూపాయల లెక్కన కట్నం చెల్లిస్తున్నారట. దాడులు జరపకుండా వుండడంతో పాటు, వ్యాపారుల మధ్య వచ్చే తగాదాలకు తీర్పు లివ్వడం, వీధి రౌడీల నుంచి వారిని కాపాడడమూ పోలీసుల విధి నిర్వహణలో భాగమే!

పోలీసుల రక్షణలో ఈ చిత్తు లాటరీల వ్యాపారం మూడు టిక్కెట్ల అమ్మకం, ఆరు కాపురాల అంతంగా, నిర్విఘ్నంగా కొనసాగి పోతూంది. వేలాది సంసారాలను నిట్ట నిలువునా ముంచి వేస్తున్నది. భూటాన్ లాటరీ చీటీలు గత రెండున్నర నెలలుగా కొంటున్న వారికి, ఒక్క సారికూడా సింగిల్ నంబర్ ప్రైజు తగల లేదట. సెంటిమెంటుతో, జూద వ్యామోహంతో ఒకే నంబరుపై ఆడిన వారు కొంప, గోడు, అమ్ముకొని ఆత్మ హత్యలకు పాల్పడే దుస్థితికి దిగజారి పోయారు.

దువ్వూరి రామిరెడ్డి జయంతి సభలో రచయిత నాగభైరవ కోటేశ్వర రావును సన్మానిస్తున్న డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, వర్తమాన సమాజం అధ్యక్షులు పివి రమణారెడ్డి, అగస్త్య వెంకురెడ్డి, సర్వోదయ కాలేజీ లెక్చరర్ కుమారి గిరిజ, బి. నరసింహులు

# దువ్వూరి రామిరెడ్డి కవికాదు- క్రాంతి దర్శి!

12 తేది టౌన్‌హాల్‌లో దువ్వూరు రామిరెడ్డి విజ్ఞాన సమితి -వర్తమాన సమాజం సంయుక్త యాజమాన్యాన జరిగిన 'కవి కోకిల' 98 వ జయంతి సభకు ప్రముఖ రచయిత, కవి శ్రీనాగభైరవ కోటేశ్వర రావు ప్రధాన వక్తగా విచ్చేశారు. కవి కోకిల దువ్వూరి రామిరెడ్డి సార్వజనీనములు, సార్వకాలికములైన కావ్య కళాఖండాలనెన్నో రచించి యిచ్చిన కవితా శిల్పి, క్రాంత దర్శియైన మహాకవి అన్నా రాయన. విభిన్నములైన సాహిత్య ప్రక్రియలలో కృషి సల్పినా, కర్షక కవిగానే దువ్వూరి పేరు గాంచారు. రామిరెడ్డి గారి కావ్యాలు పరిమాణమున చిన్నవైనా ప్రమాణమున మిన్నలు; ఆయన కావ్యాలలో నలజారమ్మ, యువక స్వప్నం, కడపటి వీడ్కోలు సాంఘిక కావ్యాలంటూ వాటిలోని గుణగణాలను విశ్లేషిస్తూ చక్కని ప్రసంగం కావించారు శ్రీనాగభైరవ.

అధ్యక్షించిన ఉత్తరప్రదేశ్ మాజీ గవర్నర్ డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, రామిరెడ్డి గారు కవియే గాక విజ్ఞాన శాస్త్రం పై కూడా మంచి పట్టు సాధించిన ప్రజ్ఞాధీరుడని ప్రస్తుతించారు. 1995 లో నెల్లూరీయులు ఆయన శత జయంత్యుత్సవాన్ని ఘనంగా జరుప కోవాలని ఆకాంక్షించారు. దువ్వూరి పుస్తకాలను సంపుటాలుగా ముద్రించను ముందుకు వచ్చిన నిప్పో

కొరవ 9 పేజీలో

# నెల్లూరు సంగతులు

కనీసం పౌర సంఘాలు, వివిధ పార్టీల యువజన సంఘాలైనా ఈ దుర్మార్గాన్ని, దోపిడీని అరికట్టడానికి సమాయత్తం కావాలి.

### జిల్లాకు హ్యాం రేడియో సెట్లు

ప్రతి యేడు వర్షాలు, వరదలు, తుఫాన్లకు గురౌతున్న మన జిల్లాల్లో, విపత్కర సమయాల్లో కమ్యూనికేషన్ వ్యవస్థ పూర్తిగా విఫలమై పోతున్నది. పోలీస్ వైర్‌లెస్ సెట్లు కూడా అంతంత మాత్రంగానే వుపయోగ పడుతున్నాయి. ఈ విషయాలను జిల్లా కలెక్టర్ రాష్ట్ర ప్రభుత్వానికి వివరించడంతో అత్యవసర పరిస్థితులలో వుపయోగించు కొనేందుకు 30 హ్యాం రేడియో సెట్లను ప్రభుత్వం మంజూరు చేసింది. 11 తేది జిల్లా కేంద్రాన్ని చేరుకొన్న వీటినుప యోగించడానికి హ్యాం రేడియో వినియోగాన్ని అనుభవమున్న వ్యక్తుల సహకారం తీసువాలని అధికారులు తలపోస్తున్నట్లు తెలిసింది.

### కళ విశ్వ జనీయ మైంది

కళకు జాతి, కుల మత బేధాలుండవని, అది విశ్వ జనీయ మైనదని నెల్లూరు ఎమ్మెల్యే శ్రీ జె.కె. రెడ్డి అన్నారు. 14 తేది కస్తూరి బా కళాక్షేత్రంలో జరిగిన కళాజ్యోతి మిమిక్రీ అసోసియేషన్ వార్షికోత్సవ సభకు ముఖ్య అతిథిగా విచ్చేశారు. ప్రభుత్వం కళారంగానికి ఇస్తున్న ప్రోత్సాహాన్ని కళాకారులు వినియోగించుకోవాలి; జిల్లాలో విశిష్టమైన మిమిక్రీ కళాకారులుండడం జిల్లాకే గర్వకారణ మన్నారు జె.కె. కళాకారుల సంక్షేమ కేంద్రం రాష్ట్ర కార్యదర్శి వున్నం బసవయ్య, రియల్ ఎస్టేట్స్ అధినేతలు టి. ఆనంద కుమార్, సుధాకర్ రాజా తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. ఇటీవల విదేశాల్లో పర్యటించి వచ్చిన క్రీడాకారుడు డాక్టర్ శ్రీధర రావుతో పాటు వర్ధమాన గాయకుడు పాటూరు శ్రీనివాసులును సంస్థ సన్మానించింది. వివిధ పోటీల్లో గెలుపొందిన విద్యార్థులకు బహుమతు లందజేశారు. అనంతరం జాషువా, బాలరాజు, మిమిక్రీ ప్రదర్శన సింహపురి సుధాకర్ మేజర్ చంద్రకాంత్ వేషధారణ, అరుణ కూచిపూడి నృత్యాలు ప్రేక్షకులను అలరించాయి.

కొరవ 9 పేజీలో

# నెల్లూరు ముచ్చట్లు

విహార్మకుడు

## మంత్రుల ముట్టడి

ఈ వారమంతా నెల్లూరు మంత్రుల ముట్టడికి గురైంది. జిల్లా మంత్రులిద్దరూ సరే - హైదరాబాదులో వుండేది తక్కువ; వారికి నెల్లూరు గెస్టుహౌస్ సెక్రెటేరియట్ క్రింద లెక్క. జిల్లా గొడవలే పట్టించుకొని నామకేవాస్తే జిల్లా ఇన్‌చార్జి మంత్రి శ్రీ పి. సాంబశివరాజు, రెవిన్యూ మంత్రి శ్రీ కె. రామిరెడ్డి కూడా ఈ వారంలో నెల్లూరు వచ్చారు.

రామిరెడ్డి గారిది ఒక రోజు కార్యక్రమం- 16 తేది వచ్చి నెల్లూరు, సర్వేపల్లి, నియోజక వర్గ ప్రాంతాలలో వాన నష్టం చూసి వెళ్లారు; సాంబశివరాజు గారు 15 తేది వచ్చి ప్రణాళికా మండలి సమావేశంలో పాల్గొన్నారు; 16 తేది రామిరెడ్డి తోను, 17 తేది యానాదిరెడ్డి గారితోను కలిసి తిరిగి, కావలిలో రైలెక్కారు.

పెంచలయ్య, యానాదిరెడ్డి గార్లు 13 తేది నుంచి నెల్లూరులోనే వున్నారు; ఈరోజు (19 తేది) వెళ్తారు.

## కార్యదర్శులరాక

నెల్లూరు జిల్లాలో జరిగిన వాన నష్టం పరిశీలించడానికి రాష్ట్ర సహాయ పునరావాస కమీషనర్ శ్రీ దివాన్, పంచాయితీ రాజ్ ప్రిన్సిపల్ కార్యదర్శి శ్రీ ఎవిఎస్‌రెడ్డి నెల్లూరు వచ్చి వెళ్లారు. కలెక్టర్ గారు వారికి రోడ్లకు, చెరువులకు జరిగిన నష్టం వివరించి, కొన్ని గండ్లు పడిన చెరువులూ చూపించారు. జిల్లాలో మొత్తం 53 చెరువులకు కట్టలు తెగాయి.

## పిసిరెడ్డికి సన్మానం

నెల్లూరులో ఎన్ని పౌర సంఘాలున్నాయో, అన్నిటితోనూ ఏదో ఒక రూపంలో సంబంధాలు కల్గిన నిత్యోత్సాహి, వృద్ధాప్యం వయస్సుకె తప్ప, మనస్సుకు కాదన్నట్లు చలాకీగా తిరిగే "యువకుడు" ప్రొఫెసర్ పిసిరెడ్డికి సన్మానం చేయ బోతున్నారు. రేపు డిసెంబరులో ఆయనకు 77 ఏళ్లు పూర్తవుతాయి. అందరూ సహకరించాలని అభినందన కమిటీ కోరుతున్నది.

## విజయమహల్ బ్రిడ్జి ఆందోళన

విజయమహల్ లెవల్ క్రాసింగ్ దగ్గర బాక్స్‌టైప్ బ్రిడ్జి నిర్మాణంలో జరుగుతున్న అలస్యానికి నిరసనగా ఆందోళన జరపాలని సిపిఎం పార్టీ నిర్ణయించింది. ఈ బ్రిడ్జికి రైల్వే శాఖ ఎప్పుడో అనుమతి మంజూరు చేసింది. మునిసిపాలిటీ తన వాటాగా 30 లక్షలు చెల్లించాలి. 20 లక్షలు మాత్రం కట్టి వారు చేతులెత్తేశారు. మూడేళ్ల నుంచి ఆ ఫైలు అడుగున పడి పోయింది. ఎమ్మెల్యే జకెరెడ్డి తన నియోజక వర్గ నిధుల నుంచి 10 లక్షలు ఇస్తానన్నా పని జరగలేదు.

గేటు కవతల దాదాపు లక్ష జనాభా వుంది. వారందరికీ ఇదే దారి. మమూలు గానే గేటు దాటడం నరక ప్రాయం; వానలు పడి, అండర్ బ్రిడ్జిలు రెండూ నీళ్లలో మునిగి పోయినప్పుడైతే. ఆ బాధ వర్ణనా తీతం. ఇంత ప్రధానమైన ఈ సమస్య పట్ల పదేళ్ల నుంచి ఆందోళన జరుగుతుంటే అధికారుల చెవికెక్కడం లేదంటే - అది ఒక్క నెల్లూరు లోనే సాధ్యమేమో! ఇక్కడి వలె నాయకులు, పౌరులు చేవ చచ్చి వుండడం ఇంకెక్కడా వుండదు. సిపిఎం నాయకుడు వున్నం బసవయ్య బ్రిడ్జి పని మొదలు పెట్టే వరకు ప్రతిరోజూ ధర్నాలు చేస్తామని ప్రకటిస్తున్నారు. బాలాజీ నగర్ వాసులంతా ఆయనతో సహకరించడం గ్యారంటీ!



## కొత్త ఆర్‌టిఓ

నెల్లూరు కొత్త ఆర్‌టిఓగా శ్రీ జి. కుమార్‌రెడ్డి నియమితులైనారు; ఇక్కడ పని చేస్తుండిన నరసింహ స్వామి రిటైర్ కావడంతో ఈ నియామకం జరిగింది.

## విఆర్‌సి లెక్చరర్‌కు కామర్స్‌లో డాక్టరేట్

నెల్లూరు విఆర్ కాలేజి కామర్స్ లెక్చరర్ శ్రీ కె. నరేంద్ర రెడ్డికి వెంకటేశ్వర విశ్వ విద్యాలయం డాక్టరేట్ ప్రదానం చేసింది. ఆంధ్రప్రదేశ్‌లో చక్కెర ఫ్యాక్టరీల లాభదాయకత - కోవూరు ఫ్యాక్టరీ పై ప్రత్యేక పరిశీలన అనే అంశం పై ఆయన సమర్పించిన పరిశోధక వ్యాసానికి ఈ పిహెచ్‌డి పట్టా ప్రకటించారు. నరేంద్ర రెడ్డికి విఆర్ కాలేజి ప్రిన్సిపల్ డాక్టర్ డి. గోపాల కృష్ణమూర్తి గైడ్‌గా వ్యవహరించారు.



నరేంద్ర నాథ రెడ్డి. కావలియుడు. శ్రీ కూనం రామకృష్ణా రెడ్డి కుమారుడు; కావలి కాలేజి మాజీ ప్రిన్సిపల్ శ్రీ పట్టాభి రామరెడ్డి అల్లుడు. కావలిలోనే బికాం, ఎం.కాం చదివాడు. విఆర్ కాలేజి కామర్స్ విభాగం ద్వారా సిద్ధాంత వ్యాసం సమర్పించి, సాధించిన తొలి డాక్టరేట్ ఇది. నరేంద్రనాథ్‌రెడ్డికి మా అభినందనలు.

## తుమ్మితే వూడే ముక్కుల వంటి చెరువులు

గత వారం కురిసిన వానలకు జిల్లాలో ప్రభుత్వ భవనాలు, చెరువులు, రోడ్లు వంతెనలు, కలుజాలు వగైరా వగైరా ఆస్తులకు జరిగిన నష్టం చూస్తుంటే కడుపు మండి పోతున్నది.

రాపూరులో ఒక సాంఘిక సంక్షేమ హాస్టలు భవనం దెబ్బతిన్నదట; వెంకటగిరిలో అలపలేరు డ్యాం ప్రధాన భాగం జనార్ధనరెడ్డి గారు ప్రారంభోత్సవం చేసి వారం తిరగ కుండానే కొట్టుకొని పోయింది. 53 చెరువులకు గండ్లు పడ్డాయి. కండ్లేరు ప్రాజెక్టులో కాంక్రీటుతో కట్టిన గోడలు, కట్టడాలు కూలి పోయాయి. టౌన్‌లోను, ఇతర చోట్ల రోడ్లకు జరిగిన నష్టం మాటలతో వర్ణించలేము. తుఫాన్ పనుల క్రింద ప్రపంచ బ్యాంకు అప్పుతో వేసిన ఖరీదైన రోడ్లు నామ రూపాలు లేకుండా పోయాయి.

ఈ సంఘటనలన్నీ చూస్తుంటె నాయకులు, అధికారులు, కాంట్రాక్టర్లు కలిసి ప్రజా ధనం ఎంత పచ్చిగా దోచుకొని తింటున్నారో అర్థమౌతుంది. ఈ దుర్మార్గాలిట్లా కొన సాగ వల్సిందేనా? ఒక్క ధికారి మీద, ఒక్క కాంట్రాక్టర్ మీద చర్య తీసుకొనే దమ్ములు ఎవరికి లేదా?

ప్రజా ధనంతో జరిగే ప్రాజెక్టులు, ఇతర నిర్మాణాలపై పర్యవేక్షణకు, కనీస స్థాయిలో నైనా పని జరిగేటట్లు చూడడానికి ఏదైనా ప్రజా సంఘం ఒకటి ఏర్పడవలసిన అవసరం వుంది. నాయకులు ఎవరైనా ఈ బాధ్యత స్వీకరించ కూడదా?

## సోమశిల ఫుల్

రాయలసీమలో కుండ పోతగా వానలు పడడంతో సోమశిల రిజర్వాయర్‌కు పూర్తి స్థాయిలో నీళ్లు వచ్చాయి. భూసేకరణ పూర్తి అయివుంటే ప్రాజెక్టులో నిర్దేశించిన 75 టిఎంసిల నీళ్లు నిలువ చేసే అవకాశం లభించి వుండేది. ఆ రైతులకు డబ్బు చెల్లించక పోవడంతో 37 టిఎంసిలు నిల్వ చేసి తక్కిన నీటిని దిగువకు వదిలేస్తున్నారు. ఈ నిల్వలోనే నెల్లూరు, కోవూరు డెల్టాలకు రెండు పంటలకు నీళ్లు సరఫరా చేయగలుగుతామని అధికారులు భావిస్తున్నారు. అది వీలైనా కాకపోయినా, భూగర్భ నీటి మట్టం నిలకడగా వుంటుంది కాబట్టి మంచి నీళ్ల కొరత వుండదు; ఫిల్టర్ పాయింట్లు సాగుకు ఇబ్బంది కల్గదు. నెల్లూరు, కనిగిరి, సర్వేపల్లి చెరువులూ ఫుల్‌గా వున్నాయి.

## వి.ఆర్. కళాశాల లెక్చరర్‌కు డాక్టరేట్

వి.ఆర్. కళాశాలలో ఫిజిక్స్ లెక్చరర్ గా పని చేస్తున్న శ్రీ ఎ.వి. రంగారెడ్డికి వెంకటేశ్వర విశ్వ విద్యాలయం డాక్టరేట్ బహూకరించింది. 'స్టడీస్ ఆన్‌ది ఫోటో ల్యూమినిసెన్స్ ప్రాపర్టీస్ ఆఫ్ రర్టన్ రేర్ ఎర్త్స్ డోప్‌డ్ ఫూరో ఫాస్పేట్ గ్లాసెస్' అనే సైద్ధాంతిక వ్యాసానికి ఈ డాక్టరేట్ లభించింది. ఐదు అధ్యాయాలు గా రూపొందించిన ఈ



వ్యాసం డాక్టరేట్ సమర్పణకు ముందే విదేశీ పరిశోధక పత్రికల్లో ప్రచురింప బడింది. ఒకవైపు లెక్చరర్‌గా పనిచేస్తూనే పి.హెచ్‌డిని 3 సంవత్సరాల్లో రెగ్యులర్ విద్యార్థులతో సమానంగా పూర్తిచేయడం విశేషం. ఈయన విశ్వవిద్యాలయ భౌతిక శాస్త్ర రీడర్ డాక్టర్ ఎన్. బుద్ధుడు ఆధ్వర్యంలో పరిశోధనలు సాగించారు.

## అభినవ రామదాసు అస్తమయం

బుజబుజ నెల్లూరులో శ్రీరామాలయం నిర్మించిన అభినవ రామదాసు శ్రీ బొడ్డు వెంకటరమణయ్య 8 తేది హఠాత్తుగా మరణించారు. నెల్లూరులో ఏ కొద్ది దైవభక్తి కల్గిన వారి కెవరి కైనా రమణయ్య తెలియకుండా వుండదు. ఎలక్ట్రిసిటీ బోర్డులో చిన్న ఉద్యోగం చేస్తూనే, అరపరాని రామ భక్తితో ఇల్లిల్లూ తిరిగి, రూపాయి రూపాయిగా దండి, అంత పెద్ద ఆలయం నిర్మించారు. రమణయ్యకు వేరే ధ్యాస, వ్యాపకం వుండేవి కావు. నిద్రలోనూ అదే పలవరింత. తన జీవిత కాలంలోనే ఆలయ నిర్మాణం పరిపూర్ణం గావించి, తృప్తిగా చనిపోయారు.

రమణయ్యకు ఇద్దరు కుమారులు; వారి కుటుంబానికి మా ప్రగాఢ సానుభూతి.

## జనవాణి

(3 వ పేజి తరువాయి)

ప్రయోజనులకు లోనగుచు. కాలహరణమని విస్సుపా చెందుట జరుగు చున్నవి.

నేడు న్యాయస్థానములలో, ప్రభుత్వమే వ్యవహారి. యిక్కువ శాతం ప్రభుత్వ వ్యవహారములే. ప్రజా ప్రభుత్వము న్యాయమూర్తుల నిర్ణయాధికారాన్ని, తన గుప్పిళ్లలో పెట్టుకొని వున్నది. అందువల్ల అనేక అనర్థాలు, అపోహలకు న్యాయ వ్యవస్థ గురి యౌతున్నది. న్యాయ వ్యవస్థ రాజకీయాలతో ముడి పడి పోయింది. కరకు ప్రభుత్వ న్యాయవాదుల నిర్ణయ ప్రక్రియ మొదలు, ఉన్నత న్యాయమూర్తులు నియామకం కరకు ప్రభుత్వ సిఫార్సుల మీద ఆధార పడ వలసి వస్తూంది. ఉన్నత న్యాయమూర్తుల నిర్ణయ విధానం ప్రజల విశ్వాసాన్ని పోగొట్టు కుంటున్నది. అఖిల భారత న్యాయ శాస్త్ర పరీక్ష లెందుకు పెట్టరో తెలియదు. న్యాయ మూర్తుల బదిలీలు ఇతర రాష్ట్రాలకు యెందుకు చేయరో అర్థం కాదు. తన రాష్ట్ర ఉన్నత న్యాయస్థానంలో కొన్ని దశాబ్దాల పాటు న్యాయవాదిగా జీవనం గడిపిన వ్యక్తులను, అదే న్యాయస్థానంలో న్యాయమూర్తిగా నియమించడం హాస్యాస్పదం. న్యాయము జరగక పోయినా జరుగుతున్నట్లు వ్యక్తంకావాలి అనే సూత్రమునకు యీ విధానము వ్యతిరేకం "Though Not Justice done, must appear to be done" న్యాయ మూర్తులందరు, మానవ మాత్రులే. మాన వాతీతులు కాదు. జిల్లా స్థాయిలో న్యాయమూర్తి ప్రతి మూడు సంవత్సరాలకు బదిలీ లవుతారు. దీని అంతరార్థ మేమిటి? అది ఉన్నత న్యాయమూర్తులకు యెందుకు వర్తించదు? న్యాయ స్థాన ఉన్నతి నిలుపు కోవాలంటే, అనుభవజ్ఞులైన, వయోపరిమితి గల వారినిఅఖిల భారత న్యాయశాస్త్ర పరీక్ష నెగ్గిన వారిని, స్వరాష్ట్రములలో గాకుండా ఐ.పి.ఎస్., ఐ.ఎ.ఎస్. అధికారుల మాదిరి ఇతర ప్రదేశాలకు నియమించాలి. ఉన్నత న్యాయమూర్తులు, పదవీ విరమణ తదుపరి ప్రభుత్వంలో యే విధమైన స్థానమునకూ అనర్హులు కావాలి. వారు నిర్భయంగా, ఆత్మ విశ్వాసంతో విధి నిర్వహణ చేయుటకు వలసినంత సౌకర్యములు ప్రభుత్వం కల్పించాలి. అప్పుడే వారు ప్రజా విశ్వాసము వమ్ముజేయు వీలుండదు. వ్యవస్థ గౌరవం నిలవ గలదు.

న్యాయవాదులకు, ప్రతి వివాద నిజా నిజములలో చాలా వరకు తెలుసుకొను వీలున్నది. వారి వంతుకు వారు సంఘ శ్రేయస్సుకు, న్యాయవ్యవస్థ పునాదులు బీటలు వారకుండా, పరిష్కరించడానికి పూనుకోవాలి. చట్టాలలో ఏమైనా వుండవచ్చు. వాటి నాస్కారంగా తీసుకొని, నైతిక విలువలు గౌరవించి వ్యవహార పెంపకమునకు స్వస్థి చెప్పడం మంచిది. తద్వారా, న్యాయార్థికి సత్వర న్యాయమంద గలదు. న్యాయ సౌధము పగుళ్లు బారితే, ప్రజాప్రభుత్వ మనుగడే కష్టము.

మేధావి వర్గమునకు నేడు రాజకీయాలలో స్థానం లేదు. ప్రభుత్వము ఆయాశాస్త్ర పరిజ్ఞాన వంతులైన మేధావుల సలహాలు పాటించడం శ్రేయస్కరం. న్యాయస్థానములను గౌరవించడం వల్ల ప్రజా ప్రభుత్వ మనుగడకు ముప్పు వాటిల్లదు. నేటి అపోహలకు, అవిశ్వాసమునకు అందరు వారివారి వంతుకు వారు బాధ్యులే. గనుక ప్రభుత్వము, ప్రజలు, న్యాయ వ్యవస్థకు చెందిన ప్రతివారు, న్యాయవ్యవస్థ పునాదులు బీటలు వారుటకు సహాయకారులు కాకూడదు; లేని యెడల, న్యాయవ్యవస్థ బీటలు వారుట తథ్యం, రాజ్యపాలన దుర్లభం; దేశానికే అనర్థం.

- యం. మల్లికార్జునరావు, నెల్లూరు



## లైబ్రేరియన్ పోస్టులు అమ్ముకున్నారు

ఇటీవల జిల్లా గ్రంథాలయ సంస్థలో ఖాళీగా వున్న లైబ్రేరియన్ పోస్టులు భర్తీ చేసే విషయంలో పలు అవకతవకలకు పాల్పడ్డారు. గ్రంథాలయ సంస్థ ఇచ్చే కొద్ది పాటి జీతంతో పని చేస్తున్న తాత్కాలిక వుద్యోగులను ప్రక్కకు నెట్టిభారీ మొత్తంలో లంచం ముట్ట జెప్పిన కొత్త వారికి వుద్యోగాలు కట్టబెట్టారు. జిల్లాలో ఎంతో మంది గ్రంథాలయ కోర్సులో ఉత్తీర్ణులై నప్పటికి చిత్తూరు, విజయవాడకు చెందిన అభ్యర్థులను భర్తీ చేయడంలో అవినీతి స్పష్టమవుతుంది. అదేమంటే పరీక్ష, ఇంటర్వ్యూ, మెరిట్ అని చెబుతున్న అధికారులు ముందుగానే ప్రశ్నా పత్రాలు తమ అనుకూల అభ్యర్థులకు రహస్యంగా అందజేశారు. ఈ విషయాలన్నీ బహిరంగమైనా ఇంత వరకూ ఏ ఒక్క వున్నతాధికారి విచారణకు ఆదేశించక పోవడం శోచనీయం.

నెల్లూరు -ఓ బాధితుడు

### మూతికాలింది

(2 వ పేజి తరువాయి)

తరలించారని ఎవరో మీ మైండ్ నుంచి పెట్టినట్లున్నారు. నిజంకాదు. ముందు మీ మై... దాన్ని తుడిచేయండి" అంటూ ... స్టైల్‌లో చెప్పేసరికి ముఖ్యమంత్రి చిరాకు పడ్డారట.

"ఏం! యానాది రెడ్డి ఏం మాట్లాడుతున్నావ్! పిల్లచేష్టలు చేస్తున్నావ్ తెలిసి మాట్లాడు తున్నావ్ తెలియక మాట్లాడు తున్నావా! నో....యు", అంటూ కన్నెర్ర చేశారట. ముఖ్యమంత్రిగారి చివరిమాట స్పష్టంగా లేక పోయేసరికి అక్కడున్న నలుగురూ నాలుగు రకాలుగా అనుకున్నారట.

ఆ తర్వాత ముఖ్యమంత్రి దగ్గర నుంచి అందరూ బయలు దేరి బయటకు వచ్చారు. అయితే యానాది రెడ్డి మాత్రం ముఖ్యమంత్రి ఇంట్లోనే వుండిపోయారట. సరిగ్గా గంట తర్వాత యానాది రెడ్డి, శేషారెడ్డికి సుబ్బరామి రెడ్డికి ఫోన్ చేసి "మీరు వెళ్లిపోయాక నేను ముఖ్యమంత్రితో గంటసేపు మాట్లాడాను. చాలా డీటైల్‌గా మాట్లాడాను" అంటూ వివరణ ఇచ్చారట. ఇంతకూ యానాది రెడ్డి గారు ముఖ్యమంత్రిగారితో ఏం మాట్లాడినట్లు? నోరు జారినందుకు, మూసుకోమని మీరే సెలవిచ్చారు కాబట్టి దాసుడి తప్పు దండంతో సరిపెట్టుకోమని బ్రతిమలాడి బుజ్జగించి వుంటాడేమో! యానాది రెడ్డిగారి పని తీరు గురించి జిల్లా కో ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు ప్రెసిడెంట్‌లు ముఖ్యమంత్రికి తరచూ ఫిర్యాదు చేస్తున్నట్లు భోగట్టా. ఈ నేపథ్యంలో యానాది రెడ్డిగారు తనదైన స్టైల్‌లో నలుగురి ముందు ముఖ్యమంత్రితో 'కోపం వచ్చినట్లు వ్యవహరించడంతో ముఖ్యమంత్రి ఆపుకోలేక యానాది రెడ్డిని మందలించి వుండవచ్చు. పాపం- జనార్దన రెడ్డి జిల్లాకు ఏమీ చేయలేదు! అని చెప్పి ముఖ్యమంత్రి దగ్గర మార్కులు కొట్టేయాలనుకున్న మంత్రి గారికి ఊహించని విధంగా 'చీవాట్లు' పడ్డాయి. డామిట్! కథ అడ్డం తిరిగింది.

### జిల్లా వార్తలు

(2 వ పేజి తరువాయి)

#### గెస్ట్‌హౌస్‌కు దొంగల భయం

దొంగలకు భయపడి అందమైన గెస్ట్ హౌస్‌ను శిథిలావస్థకు చేరుస్తున్న అటవీ శాఖ ఘన వుదంత మిది. రాపూరు మండలం గోనుపల్లి గ్రామంలోని ఫారెస్ట్ గెస్ట్ హౌస్‌ను ఏ ఒక్కరూ వాడక పోవడం వల్ల చెట్లు పుట్టలతో నిండి పోయింది. ఈ ఫారెస్ట్ రేంజ్‌లోని అడవిని చూసేందుకు వచ్చే అధికారులు, విఐపిల కోసం పదేళ్ల క్రితం గెస్ట్‌హౌస్ కట్టి వాచ్‌మెన్‌ను కూడా పెట్టారు. ఆ యేడే వాచ్‌మెన్ కుటుంబ సభ్యులను దొంగలు భయపెట్టి దోచుకెళ్లడంతో ఆ ఛాయలకు ప్రజలు వెళ్లడం మానుకున్నారు. ఆలనా, పాలనా చూసే నాథుడు లేక గెస్ట్‌హౌస్ పాడు పడి పోతూంది. అటవీ శాఖాధికారులే దొంగలకు భయపడి గెస్ట్‌హౌస్‌ను పాడుపెడితే ఎర్రచందనపు దొంగలను వాళ్లేం పట్టుకుంటారు?

#### ఇస్కపల్లి సర్పంచ్‌పై ఆరోపణలు

అల్లూరు మండలం ఇస్కపల్లి గ్రామ సర్పంచ్ రోశీనార్ [illegible] అధిక మొత్తంలో దుర్వినియోగం చేశారని సభ్యులు ఆరోపిస్తున్నారు. పంచాయితీ సమావేశాలు పెట్ట కుండానే కొందరు సభ్యుల బోగస్ వేలిముద్రలతో సమావేశాలు జరిపినట్లు రికార్డుల కెక్కిస్తున్నారట. మంచినీటి సౌకర్యం కోసం హ్యాండ్‌పంప్‌లు వేయకుండానే వేసినట్లు బిల్లులు సృష్టించడంతో పాటు ఎలక్ట్రిక్ సామాన్లలో భారీమొత్తం స్వాహా చేసినట్లు విపక్షీయుల వాదన. వున్నతాధికార్లు విచారణ జరిపితే విషయాలన్నీ వెల్లడవుతాయని బల్లగుద్ది మరీ చెబుతున్నారు.

#### వర్షాల వల్ల ముత్తుకూరుకు నష్టం

గత వారంలో కురిసిన వర్షాల వల్ల ముత్తుకూరు మండలంలో భారీ నష్టం సంభవించింది. పై నుంచి వెల్లువ నీరు రావడం వల్ల పల్లపు ప్రాంతాలు జలమయ్యాయి. కృష్ణ పట్నం సాల్టు సొసైటీలో వుత్పత్తి అయిన ఉప్పు కండలేరు పొంగడంతో నీటిలో కలిసిపోయింది. నిడిగుంట పాళెం సమీపంలో నక్కల కాలువ పై వంతెన నిర్మాణానికి వేసిన వంతెన సెంట్రింగ్ నీటి ఉధృతానికి కొట్టుక పోయింది. రోడ్లు దెబ్బతిని పోవడంతో ఈపూరు, పంటపాళెం, నారికేళ్ల పల్లి, నిడిగుంట పాళెం లకు రాక పోకలు స్తంభించి పోయాయి. నెల్లూరు-ముత్తుకూరు రోడ్డు కాకుపల్లి వద్ద తమ కాలనీ లోనికి నీళ్లు వచ్చాయని నందమూరి కాలనీ వాసులు తెగ్గొట్టారు. దీనివల్ల ముత్తుకూరు, ఈపూరు, కృష్ణపట్నం బేసిన్‌లకు వెళ్ళే ఆర్టీసి బస్సులను టి.పి. గూడూరు, వరిగొండల మీదుగా మళ్ళించారు. పంటపొలాల్లో నీరు నిలబడి పోవడం వల్ల అక్కడక్కడా పంట కూడా భారీగా దెబ్బతిన్నది.



### ప్రకటన

శ్రీ పోలి రెడ్డి వెంకట మురళీకృష్ణ కుమార్, S/o. హరినారాయణ, నెల్లూరు జిల్లా నెల్లూరు టౌన్ రంగనాయకులపేట అనకట్ట రోడ్డులో నెం. 8/562, గల నా కొట్టును 20-3-91 తేది బాడుగకు తీసుకొని క్రమముగా బాడుగలు చెల్లించక సుమారు 1993 మార్చి నుండి అతడు కనబడుట లేదు. అతని అడ్రసు నాకు తెలుపి వుండలేదు. అతడు ఎచ్చట ఉన్నను వెంటనే వచ్చి బాడుగలు చెల్లించి కొట్టు ఖాళీ చేయవలెను. లేనిచో చట్టపరముగా అన్ని విధములైన చర్యలు తీసుకొనబడునని తెల్పడమైనది.

కె.టి. రామానుజాచార్యులు

వానమామలై మఠము,

మూలపేట, నెల్లూరు

నెల్లూరు, తేది: 7.11.93

# వారసుడు లేని కొరత మహేష్‌తో తీరుతుందా?

ఇంతకు ముందు పలు చిత్రాల్లో బాలనటుడిగా వివిధ భూమికలు ధరించిన సూపర్ స్టార్ కృష్ణ చిన్న కుమారుడు మహేష్ హీరో అవుతున్నారు. మామూలుగా పెద్ద హీరోల కుమారులను తొలిసారిగా తెరకు పరిచయం చేసిన సమయాల్లో రాఘవేంద్ర రావు, మధుసూదన రావు, మణిరత్నం వంటి దర్శకులుండడం రివాజు. కాని కృష్ణ ఈ విషయంలోనూ తాను నిత్యం ప్రదర్శించే డేరింగను ప్రదర్శించాడు. రాజేంద్రుడు-గజేంద్రుడు, మాయలోడు చిత్రాలను నిర్మించిన కొత్త సంస్థ మనీషా ఫిలిమ్స్‌కు ఈ ఛాన్స్ ఇచ్చారు. స్క్రీన్‌ప్లే సంగీతం, దర్శకత్వాన్ని ఎస్వీ కృష్ణా రెడ్డి వహిస్తారు. జనవరిలో షూటింగ్ మొదలయ్యే ఈ చిత్రం స్కోపులో తీస్తున్నారు. హీరోయిన్ ఎంపిక ఇంకా జరగలేదు. పాతతరం హీరోలందరి కుమారులూ ప్రస్తుతం వారి వారసులుగా హీరోలుగా కొనసాగుతున్నా కృష్ణకు మాత్రం వారసుడు కరవయ్యారు. అలోటును మహేష్ పూడ్చుతాడో లేదో వేచి చూడాలి!

## హిందీలో రాజశేఖర్

తెలుగు హీరోలు చిరంజీవి, నాగార్జున, వెంకటేష్ నటించిన హిందీ చిత్రాలు సక్సెస్ కావడంతో మిగతా హీరోల దృష్టి కూడా హిందీ ఫీల్డ్‌పై పడింది. హీరో రాజశేఖర్‌కూ ఇటువంటి ఆలోచన చాలా రోజులుగా వుంది. తెలుగులో ఇటీవల మరో హీరో నటించి హిట్ అయిన చిత్రం తాలూకు రైట్స్ తానే తీసుకొని అందులో నటిస్తున్నాడు రాజశేఖర్. రాజశేఖర్ నటించిన అంకుశం చిత్రం రీమేక్ చేసి చిరంజీవి 'అజ్ కా గుండారాజ్' గా రికార్డులు బద్దలు చేసాడు. మరి రాజశేఖర్‌కు అంత లక్కుందో లేదో?

## పంపిణీ రంగంలో పరుచూరి సోదరులు

చేస్తున్న ఉపాధ్యాయ వృత్తి మాని సినిమాలకు మాటలు రాసే ప్రవృత్తిని చేపట్టి దాన్నే వృత్తిగా చేసుకొన్న పరుచూరి సోదరులు మరో కొత్త రంగంలోకి అడుగు పెట్టారు. పలు సినిమాలకు దర్శకత్వం వహించడం సమర్థులుగా నిర్మాతలుగా వ్యవహరించిన ఈ సోదరులు తాజాగా ఎగ్జిబిటర్స్‌గా మారారు. శరత్ దర్శకత్వంలో కృష్ణంరాజు -జయసుధ, జగపతిబాబు-రమ్యకృష్ణల కాంబినేషన్‌లో సుప్రజ ప్రొడక్షన్ నిర్మిస్తున్న తాజా చిత్రానికి నైజాం ఏరియా రైట్స్‌ను కొని కొత్త రంగంలో అడుగిడారు. ఇటీవల హీరోలు తాము నటించిన చిత్రాల రైట్స్ కొన్ని ప్రాంతాలకు తీసుకొన్నట్లుగా తాము రచన చేసే చిత్రాలకు పరుచూరి సోదరులు ఈ విధమైన వ్యాపారం చేపట్టారేమో!

## బాపు కొత్త చిత్రం పెళ్లికొడుకు

మధ్య తరగతి జీవితాలను మధురంగా తెరకెక్కించడంలో దర్శకుడు 'బాపు' మేటి. సకుటుంబ సపరివార సమేతంగా చూడతగ్గ సినిమాలు కరువైన ఈ రోజుల్లో కుటుంబమంతా చూడవచ్చని భరోసా ముందుగానే ఇస్తూ 'పెళ్లికొడుకు' చిత్రాన్ని తీస్తున్నారు.



బ్రహ్మచారిమొగుడులో రాజేంద్రప్రసాద్

# ఒక్క పాటలో వంద డ్రెస్‌ల మార్పు

ఇటీవల పలు సంచనాలను సృష్టిస్తున్న యువ నృత్య దర్శకుడు 'ప్రభు' మరో సంచలనానికి నాంది పలికాడు. ఇప్పటి వరకు మంచేసూర్యుడు, జెంటిల్‌మెన్, ఐలవ్ ఇండియా చిత్రాలలో ఒకే ఒక పాటలో నర్తించి యువ ప్రేక్షకుల హృదయాలలో గిలిగింతలు పెట్టించిన ప్రభు తాజాగా 'ఇందూ' తమిళ చిత్రంలో హీరోగా నటిస్తున్నాడు. దర్శకుడు పవిత్రన్, కథానాయిక రోజా. ఈ చిత్రంలో పాశ్చాత్య నృత్య భంగిమల ధోరణిలో ఒకపాటలో 'ప్రభు' 100 డ్రస్‌లు మారుస్తారట. దక్షిణ భారత దేశంలో ఇంతవరకు నిర్మించిన ఏ చిత్రంలోనూ హీరో ఒక పాటలో ఇన్ని క్యాస్ట్యూమ్స్ వాడ లేదు. మొత్తానికి ఇదీ ఒక రికార్డే. ప్రభు శాస్త్రీయ నృత్య దర్శకుడుగా పేరుగాంచిన సుందరం కుమారుడు.

# బాబూమోహన్ హీరో!

బాబూమోహన్ లేని తెలుగు సినిమా రావడం లేదని చెప్పడం అతిశయోక్తి కాదు. ఇటీవల విడుదలైన మాయలోడు చిత్రంలో హీరోయిన్ సౌందర్యతో ప్రతిభావంతంగా స్టెప్స్ వేసి హీరోయిజంలోకి అడుగుపెట్టాడు బాబుమోహన్. సురేష్ మూవీస్ వారు, మామగారు తీసిన ఎడిటర్ మోహన్‌తో పాటు దర్శకరత్న దాసరి నారాయణ రావు కూడా బాబుమోహన్‌ను హీరోగా పెట్టి చిత్రాలు తీసేందుకు ముందుకొచ్చారట. కాని ఎందువల్లో వెనువెంటనే బాబుమోహన్ వారికి గ్రీన్ సిగ్నల్ ఇవ్వలేదు. ఆయన నటించే తొలి చిత్రం ఎవరిదో ప్రస్తుతానికి బాబుమోహన్‌కు తప్ప మరెవరికీ తెలియదు.

## తెలుగు తెరకు కొత్త హీరో

నెల్లూరీయుడు ప్రముఖ నిర్మాత, పారిశ్రామిక వేత్త తిక్కవరపు

కొరవ 8 పేజీలో

# మానవ సంబంధాల వింజామరలతో సేద దీర్చింది - మాతృదేవోభవ - చిన్న కథతో మనసు కదిలించి కన్నీరు కార్పించిన గొప్ప చిత్రం

పగ, ప్రతీకారం, ద్వేషం, హింసలతో విసుగెత్తిన ప్రేక్షకలోకాన్ని ఊరడించి మానవ సంబంధాల వింజామరలతో సేదదీర్చిన సమున్నత చిత్రం కె. అజయ కుమార్ రూపొందించిన 'మాతృదేవోభవ'. ఆత్మీయత కరువవుతున్న ఈ కాలంలో మమతను, మానవత్వాన్ని మనోజ్ఞంగా ఆవిష్కరించిన దర్శకుడు అభినంద నీయుడు!

**చిన్ని నారాయణ రావు**

పుట్టగానే తల్లిని, తండ్రిని కోల్పోయి, భువిపై అడుగు పెట్టగానే ఏకాకులుగా మిగిలిపోయి, అర్ధాంతరంగా తాను మరణిస్తానని తెలిసి మళ్లీ తన బిడ్డల్ని అనాథలుగా చూడలేక, దత్తత ఇచ్చే ఒక మాతృమూర్తి హృదయ స్పందనే 'మాతృదేవోభవ'! భర్తను కోల్పోయి, విధివశాత్తు బిడ్డల్ని వేరుచేసి వివిధ విధిగా పెంపకానికి ఇవ్వాల్సి రావడంలో తల్లిపడే ఆవేదన, ఆ శోకం మన గుండెల్ని పిండేస్తుంది. అత్యంత సహజంగా రూపొందించిన ఆ సన్నివేశాలు మనల్ని విషాద సముద్రంలో ముంచెత్తుతాయి. ఆ సన్నివేశాల్లో కంట తడిపెట్టని ప్రేక్షకుణ్ణి మనం కనిపెట్టలేమంటే అతిశయోక్తి కాదు!

'కౌసల్యా సుప్రజారామ' తో ఎంతో చల్లగా, ప్రశాంతంగా ప్రారంభమైన చిత్రం కుటుంబాన్ని కూల్చిన పెనుతుఫానుతో ముగుస్తుంది. ప్రతి సన్నివేశంలోనూ ప్రేక్షకుణ్ణి లీనం చేసే విధంగా సాగిన చిత్రీకరణ దానికి తగువైన సంభాషణలు వాస్తవికతకు అద్దం పట్టాయి.

అనాధలైన సత్యం, శారదలు అనాథాశ్రమ సహకారంతో భార్యా భర్తలై నలుగురు పిల్లల్ని కంటారు. ఆ తర్వాత సత్యం త్రాగుడుకు బానిస కావడంతో ఆ కుటుంబ ఆర్థిక పరిస్థితి ఛిన్నా భిన్నమౌతుంది. ఆ త్రాగుడే అప్పారావు చేత సత్యం హత్యచేయ

కొరవ 8 పేజీలో

శారద అనే ఆ అభాగ్య గృహిణి తన నలుగురు బిడ్డలను ముగ్గురు శ్రీమంతులకు దత్తత ఇచ్చి తాను కన్ను మూసి, శాశ్వతంగా కన్నబిడ్డలకు దూరమవుతుంది. ఊగ తెలిసిన కూతురు, ఇద్దరు కవలలు, అందులో ఒకడికి పోలియో, ఒక చంటి బిడ్డ, ఇలా నలుగురు ఆమె పిల్లలు.

ఈ విషాద ఘట్టం చిత్రం చివరన జరుగుతుంది. ఈ విషాద ముగింపుకుచిత్రంలో ఎన్నో విషాద సంఘటనలు చోటు చేసుకున్నాయి. శారద ప్రేమించి పెళ్లాడిన సత్యం త్రాగుబోతు కావడం ఒక విషాదం. కుటుంబ నియంత్రణకు విరుద్ధంగా శారద నలుగురు పిల్లల్ని కనడం కూడా ఒక విషాదం. శారద నెత్తిన నోరు బెట్టి మొత్తుకున్నా సత్యం త్రాగుడు మానకుండా ఇల్లుగుల్ల చెయ్యడం ఒక విషాదం. సత్యం స్నేహితుడు అప్పారావు శారదను మానభంగం చెయ్యబోవడం ఒక విషాదం. తన భార్య మీద జరిగిన అత్యాచారానికి సత్యం, అప్పారావును చంపబోవటం ఒక విషాదం. అందుకు ప్రతీకారంగా పగబూనిన అప్పారావు సత్యాన్ని హత్య చెయ్యటం ఒక విషాదం. సత్యం హత్యతో శారద నిరాధారంగా నిలవటం ఒక విషాదం. ఉన్నపళంగా శారదకు క్యాన్సరని, రెండు నెలల్లో చనిపోతుందని డాక్టరు వెల్లడించిన వైద్య పరీక్ష ఫలితం

**గిద్దలూరు గోపాలరావు**

అన్నిటికన్నా భరించరాని ఒక విషాదం. తాను పూజిస్తున్న మూడు మతాల దేవుళ్లలో ఏ ఒక్క దేవుడైనా తనను కనికరించక పోతాడా అని కంటి రెప్ప వాకిళ్లు నిండుగా తెరచి ఎద ప్రమిదలో ఆశల వత్తులు వెలిగించి ఆశగా, ఆత్రంగా వీక్షించి, జీవితమంతా నిరీక్షించిన శారదకు నిరాశే మిగలటం ఘోరమైన ఒక విషాదం. ఈ విషాదాలన్నీ ఏకమై చిమ్మచీకటి మధ్యలో మినుక్కు మినుక్కు మంటున్న ఆ ఒంటరి నక్షత్రాన్ని, విధి వంచితమైన ఆ శారదను బలి తీసుకుంటాయి.

తన జీవితం అపశృతిగా మారినా తన పిల్లల జీవితం అందమైన గీతం కావాలని శారద ఆశించింది. శారద చిన్న నాటి నుంచి అనాధాశ్రమంలో పెరిగింది. తన పిల్లలు తనలా అనాథలు కాకూడదని భావించింది. తాను పెరిగి పెద్దదైన అనాధ ఆశ్రమంలోని ఇద్దరు పెద్దల సహాయంతో తన పిల్లలను ముగ్గురు శ్రీమంతులకు దత్తత ఇస్తుంది. తన బిడ్డల బ్రతుక్కు బంగారు బాట ఏర్పరుస్తుంది. తాను పూజించినమూడు మతాల దేవుళ్లు తన విషయంలో మూగబోయినా, తన బిడ్డల భవిష్యత్తుకు మనసారా శుభం పలికినందుకు శారద సంతోషిస్తుంది. అంత వరకు ప్రతి అడుగులోనూ విరుద్ధము. ప్రతి మలుపులోనూ సందిగ్ధం. ఆలోచనకీ ఆలోచనకీ మధ్య ఆవేదన. అనిర్వచనీయమైన బాధ పొందిన శారద తన పిల్లల జీవితం

కొరవ 8 పేజీలో

# శివారెడ్డి పద్యాలు

### దీపావళి

ఇంటి నిండ వడలు, యిలపానపూరీలు
పందలాది స్వీట్లు పందులీదు;
పేరు అరివాల్లో పూరూర దీపావళి,
ఇప్పుడిరివాల్లో ఏదిలీదు!

ఎన్నో దీపావళి యిది
మన్ను దిన్న పాము, నీలో
మార్పురాల ఏమున్నది రేపామాపొ
కన్ను మూసి దిష్ఠ నరుడటాటిపాలురా!

### ఆస్తి పాస్తి

ఆస్తి పాస్తి కొరకు ఆరాట పడబోకు
పరుగలెత్త బోకు పద్సుకొరకు,
చెప్పి చెప్పి నోరు నెప్పి నీలో మార్పు
కానరాల కైము కలసిరాల!

### కళ్ళు తెరుసుకోరా

ఏది ఇందిరమ్మ, ఏమోయి బాపూజీ
ఏడి రాజీవ్‌గాంధి, ఏడి నెహ్రూ
పుట్టి నోడు తిరిగి పొయ్యె కాయమ్ము
తెలుసుకోర కళ్ళు తెరుసుకోరా!

### ఏమైందో

అల్లసాని అంటె ఆపేక్ష, పోతన్న
అంటె కవికి నాకు అమిత మోజు
మొల్లఅంటె ఒళ్ళు జల్లుమంటది నాకు
ఎక్కడుందొ యిప్పుడేమైందో!

### మోక్ష సామ్రాజ్యమ్ము

బోయ శబరి కిచ్చె మోక్షసామ్రాజ్యమ్ము
పక్షి రాజు కిచ్చె పరమ పథము
రాతి నాతి జేసె రామయ్య పథసేవ
మోక్షమునకు త్రోవ ముందు నావ!

### వైకుంఠము

ఉర్ల గడ్డ దింటె వుబ్బరిస్తుంది పొట్ట
ఇంపితమ్ము గాదు యిడ్లి కాఫి
మటను, యెగ్గు, ఫిష్ మాదాక రాబోవు
వస్తె వేరెబల్ల, వైకుంఠము!

### డాక్టరు సీతారామరాజు

వాసి కెక్కినాడు వైద్యంలో ఘట్టప్ప.
సీతారామ రాజు చెప్పదగిన
డాక్టరని ప్రతీతి తర్వాత వివరిస్తా
కవిని నేను తిరిగి కలుసుకొంటా!

### నెహ్రూ జన్మదినం

జవహర్‌లాల్ నెహ్రూజన్మదినమహోత్స
వమ్ము కోట్ల కొలది సొమ్ము, నమ్ము!
ఇండియాకు గొప్ప పండగంటె యిదేర
పాలకులకు గొప్ప పర్వదినము!

## సేదదీర్చింది

(7 పేజీ తరువాయి)

బద్ధానికి కారణం అవుతుంది. శారద కేన్సర్ బారిన పడ్తుంది. ఆమె బిడ్డల్ని విడివిడిగా దత్తతకివ్వడం తర్వాత ఆమె మరణమే ఈ సినిమాకు ముగింపు!

ఈ సినిమాలో ఆశ్రమ వాతావరణం చాలా ఆహ్లాదంగా కన్పిస్తుంది. చక్కని పవిత్రత ద్యోతక మవుతుంది. ఆశ్రమాన్ని నడిపే స్వాముల వార్లు ప్రేమను పంచి ఆప్యాయతతో అనాధల్ని ఆదుకుంటారు. ఆశ్రమాలన్నీ ఇలా మానవ సమాజానికి ఉపయోగ పడ్తే ఎంత బాగుండునో కదా అనిపిస్తుంది! అనాథశ్రమాలు అక్రమాలకు, అన్యాయాలకు నిలయాలై వర్ధిల్లుతున్న ఈ రోజుల్లో శారద కుటుంబాన్ని స్వాముల వార్లు ఆదుకున్న తీరు మనకు ఆనందాన్నిస్తుంది!

తాగుడు మిగిల్చిన విషాదంతో సత్యం కుటుంబం ఛిన్నా భిన్నమైన తీరు ఓ గుణ పాఠంగా తాగుబోతుల్ని హెచ్చరించాడు దర్శకుడు. సత్యంలో పరివర్తన ఆలశ్యం కావడంతో అతని జీవితమే అంతమవుతుంది! నిర్ణయం తీసుకోవడంలో సమయపాలనకు ఎంత ప్రాధాన్యత ఉందో, సరైన సమయానికి సరైన నిర్ణయం తీసుకోకపోతే జీవితాలెట్లా ఛిద్రయి పోతాయో దర్శకుడు సున్నితంగా చెప్పిన తీరు ప్రశంసనీయం!

హాస్యం కోసం సృష్టించిన బ్రహ్మానందం, ధర్మవరపు సుబ్రహ్మణ్యాల పాత్రలు హాస్యం వికటించి విసుగు పుట్టిస్తాయి. అయితే వీరివెతే సారావ్యతిరేకోద్యమ ప్రచారం ప్రారంభించ దానికి నాంది పలకడం బాగుంది.

పతాక సన్నివేశాల్లో ఒక్కో బిడ్డను పంపుతూ శారద పడిన క్షోభను ఎంతో సహజంగా చిత్రీకరించాడు దర్శకుడు. మాతృత్వాన్ని మహోన్నతంగా ఆవిష్కరింప జేశారు అజయ్‌కుమార్! 'కనీసం నీవు వెళ్ళి పోయేంత వరకైనా ఉంటానమ్మా' అనే కూతురు రాధ పలుకులు ములుకులై గ్రుచ్చుకుంటాయి. ముందుగా తానెప్పుడు మరణించేది తెలిసిన శారద తన బిడ్డల కోసం పడే ఆరాటం మనకు ఎంతో బాధని కల్గిస్తుంది. ఆ కుటుంబం తండ్రిని కోల్పోవడం, తర్వాత పిల్లలు ఒక్కొక్కరే వెళ్ళి పోవడం, చావుకు దగ్గర పడిన శారద, ఆమె అంగవైకల్యం కల్గిన కొడుకు మాత్రం మిగిలిపోవడం ఒక విషాదమైతే 'నేను అవిటివాణ్ణే కాబట్టే కదమ్మా నీ దగ్గర ఉండి పోగల్గాను' అనే చిన్నారి అమాయకత్వం మన గుండెల్లో బాకులు దించినంత దుఃఖాన్ని కల్గిస్తుంది. పాత్రల్లో, సన్నివేశాల్లో మనల్ని లీనం చేసి గుండెలవిసేలా ఏడ్పిస్తాడు దర్శకుడు. శారద పాత్రకు మాధవి నూరు శాతం న్యాయం చేకూర్చింది. చాలా ఏళ్ళ తర్వాత నటించడం ఒక కారణమైతే, సహజంగా నటించడం మరోకారణమై తెర పై ఆమె కాక ఆమెపాత్రే మనకు కన్పిస్తుంది. సినిమా ముగిసిన తర్వాత ఇప్పటి వరకు మనం 'సినిమాయేనా' చూసిందన్న సందేహంకల్గేంతగా చిత్రీకరణ దర్శకుడ్ని విజేతను చేస్తుంది. సత్యంగా నాజర్ కూడా పాత్రలో లీనమై నటించాడు. శారద మరణించిన తర్వాత 'కోట' దంపతులు అవిటిబాలుడి కోసం మళ్ళీ వచ్చి తీసుకెళ్ళడం ఎంతో హాయిని కల్గిస్తుంది.

సత్యమూర్తి సంభాషణలు చక్కగా సరిపోయాయి. 'లైట్లతో ఇల్లు తగలెయ్యడం' వంటి ప్రయోగాలు చాలా బాగున్నాయి.

మానవ సంబంధాల మీద తీసిన ఈ చిత్రం 'మాతృదేవోభవ', మాతృప్రేమను చక్కగా నిర్వచించి చక్కని సార్థకతను పొందినదిగా చెప్పవచ్చు. ఇది అన్ని విధాల రాష్ట్ర ప్రభుత్వ అవార్డుకు అర్హమైన చిత్రం!



## గొప్పచిత్రం

(7 వ పేజీ తరువాయి)

తీరని శాపం నుంచి గొప్ప వరంగా మారటంతో తన మరణాన్ని ఆనందంగా ఆహ్వానిస్తుంది. మాతృత్వం దైవత్వంతో సమానమని రుజువు చేస్తుంది. అందుకే "మాతృదేవోభవ" అన్నారు.

క్రియేటివ్ కమర్షియల్ యూనిట్ వ్రాసిన చిన్న కథలో విషాదాన్ని చాలా బలంగా గుప్పించారు. మెప్పించారు. కన్నీరు తెప్పించారు. దర్శకుడు కె. అజయ కుమార్ ప్రతి సన్నివేశంలోనూ తానున్నాని పించాడు.

చిత్రం పేరు గొప్పగా, గౌరవ ప్రదంగా వుంది. "రౌడీ" అనే పదాన్ని అతికించుకొని ఈనాడు కొల్లలుగా వచ్చే సినిమా పేర్లు ఎన్ని కోట్లయితే ఈ చిత్రం పేరుతో సరి తూగుతాయి!

ఈ చిత్రంలో పేరు గాంచిన హీరో లేడు. కాని చిత్రంలో ప్రతి సన్నివేశమూ ఒక హీరోగా నిలిచింది. శారదగా నటించిన మాధవి కొంత కాలంగా మరుగున వున్నా ఈనాడు పేరులో వున్న హీరోయిన్లను మించి ఈ చిత్రంలో గొప్పగా నటించింది.

చిత్రంలో వున్న నాలుగు పాత్రలు, సత్యం, అప్పారావు, బ్రహ్మానందం, ధర్మవరపు సుబ్రహ్మణ్యం నటించిన హాస్యపాత్రలు, తాగుబోతు పాత్రలుగా మలిచారు. ఇవి సారా వ్యతిరేకోద్యమానికి సహాయకారులుగా నిలుస్తాయి.

సత్యం పాత్రలో నాజర్, అప్పారావు పాత్రలో తనికెళ్ల భరణి, అనాథశ్రమం పెద్దలుగా చారుహాసన్, సుబ్బరాయశర్మలు చక్కగా నటించారు. శారద కూతురు రాధ పాత్రను పోషించిన అమ్మాయిని మెచ్చు కోవలసిందే. కీరవాణి సంగీతంలో వేటూరి వ్రాసిన పాట "వాలిపోయే పొద్దా నీకు వర్ణాలెందుకే" మధురంగా అర్థవంతంగా వినిపించింది. బారులు తీరిన విషాద సన్నివేశాలను, సంగీతంతో శృతి కలిపి జతగా నిలిచిన పాటల దృశ్యాలను చిత్రీకరించటంతో చోటా కె. నాయుడు కెమెరా అతి సుందరంగా సర్తించింది.

## సినిమా

(7 వ పేజీ తరువాయి)

సుబ్బరామిరెడ్డి తాను తీసే తరుపరి చిత్రంలో కొత్త హీరోను పరిచయం చేస్తున్నారు. ఆ హీరో పేరు చంద్రశేఖర్; హీరో రాజశేఖర్ సోదరుడు. సోదరులిద్దరి కాంబినేషన్‌లో హిందీలో విజయ వంతమైన 'సర్' చిత్రం ఆధారంగా తెలుగులో బి.గోపాల్ దర్శకత్వంలో ఈ చిత్రం తీస్తున్నారు. చంద్రశేఖర్ ఇప్పటికే పలు తమిళ హిట్ చిత్రాలలో నటించాడు. నటనలో సోదరులిద్దరి పోటీ ఏ స్థాయికి చేరుతుందో చిత్రం విడుదలయ్యాక చెప్పాల్సిందే.

### ముగ్గురు ముద్దుగుమ్మల సరసన సుమన్

తెలుగు సినీఫీల్డ్‌లో అందాల నటుడిగా ఇటీవలి కాలంలో హీరో సుమన్ పేరు గాంచాడు. అటువంటి హీరో సరసన ముగ్గురు హీరోయిన్లు నటిస్తున్నారంటే ఆ సినిమాకు ఎక్కడలేని క్రేజు వచ్చి తీరుతుంది. అమూల్య ఆర్ట్స్ అనే నూతన నిర్మాణ సంస్థ తమ్మారెడ్డి భరద్వాజ దర్శకత్వంలో నిర్మిస్తున్నది. చిత్రంలో ఇప్పటి వరకు మాలాశ్రీ ఎంపికైన కథానాయిక. మిగతా రెండు పాత్రలకు ప్రస్తుతం ఒకటి రెండూ నెంబర్లలో వున్న స్టార్స్‌ను ఎంపిక చేస్తామని నిర్మాతలు గఫూర్, పురుషోత్తంలు చెప్పారు.

### ఓ ఇంటి వాడైన కోట

ఒకప్పటి బ్యాంక్ వుద్యోగిగా అద్దె ఇంట్లో కాలం గడిపిన నటుడు కోట శ్రీనివాసరావు ఇటీవల హైదరాబాద్‌లో తాను నిర్మించు కొన్న కొత్త ఇంటిలో ఈనెలలోనే చేరబోతున్నాడు. మదరాసు నుండి చిత్ర పరిశ్రమ హైదరాబాద్‌కు షిఫ్ట్ అయ్యాక ఒక అడ్రస్ అంటూ లేకుండా పోయిందని 'కోట' ఆవేదన చెందేవారు. అందుకే ఫిలింనగర్ కాలనీలో ఒక ఇంటిని కొని దాన్ని తన అభిరుచికి అనుగుణంగా మార్చుకొన్నట్లు ఇటీవల తనను కలసిన పాత్రికేయులకు చెప్పారు.

### 50 ఏళ్ళ క్రితం

3 పేజీ తరువాయి

#### నాటకాలు

**ఇస్కపల్లి 1 తేది సక్కూబాయి:-**

రంగనాధ కుమారి తప్ప తక్కిన నటకులందరూ యుద్ధమూలాన కాస్తోకూస్తో సంపాదించిన ఆయూరి ఆర్యవైశ్యులే. మాటలు రంగమ్మ గారి స్వంత కవళం, పాటలు సినీమా వారి ఎరువు. పద్యాలు మాత్రం కవిగారి తాలూకు 4 గో భాగం - ఇక రుచి సంగతి దేముడెరుగు!

**నెల్లూరు బొబ్బిలి**

ఇది ఒంగోలు వైశ్యయువకుల జట్టు. సినీమా ధ్రస్సుతో దిగింది. మల్లమ్మ దప్ప తక్కిన అందరు బహుచక్కగా నటించారు. పాపారాయుడు రాఘవాచారిని జ్ఞప్తికి తెచ్చాడని నెలూరు గూడా అన్నారు.

## పంచాంగము

### ముహూర్తములు

20 తేది శనివారం ఉదయం 4.50 గంటలకు తులా లగ్నమున గృహారంభ, గృహప్రవేశ వివాహములకు

24 తేది బుధవారం ఉదయం 11.6 గంటలకు మకర లగ్నమున ఉపనయన, వివాహ, గృహారంభ వ్యాపార ప్రారంభములకు రాత్రి8.56 గంటలకు మిధున లగ్నమున గృహప్రవేశ వివాహములకు

26 తేది శుక్రవారం ఉదయం 5.20 గంటలకు తులా లగ్నమున గృహారంభ, గృహప్రవేశ వివాహములు. ఉదయం 9.20 గంటలకు ధనుర్లగ్నమున వివాహ వ్యాపారారంభములకు. ఉదయం 10.18 గంటలకు మకర లగ్నమున ఉపనయన వివాహ గృహారంభ వ్యాపార ప్రారంభములకు సుముహూర్తము లున్నవి.

### నవంబరు తిథులు

కార్తీక శుద్ధ:

తే 20 శని సప్తమి రా.గ. 9.15 వ
తే 21 ఆది అష్టమి రా.గ. 10.20 వ
తే 22 సోమ నవమి రా.గ. 11.48 వ
తే 23 మంగళ దశమి రా.గ. 1.40 వ
తే 24 బుధ ఏకాదశి రా.గ. 3.42 వ
తే 25 గురు ద్వాదశి రా.గ. 5.50 వ
తే 26 శుక్ర త్రయోదశి పూర్తిగా వున్నది.

స్వయంపాకుల శ్రీనివాసులు

జిల్లా ప్రణాళికా మండలి సమావేశంలో వర్షాలవల్ల జరిగిన నష్టాలను వివరిస్తున్న కలెక్టర్. ప్రక్కనే రాష్ట్ర మంత్రులు కె. రామిరెడ్డి, పి. సాంబశివరాజు, పనల పెంచలయ్య, కలికి యానాది రెడ్డి.

## నెల్లూరు సంగతులు

( 4 పేజి కొర వ )

### విదేశీ విద్యాభ్యాసానికి ట్రైనింగ్ స్కూల్

విదేశీ విద్యాభ్యాసానికి వెళ్లే విద్యార్థులకు అవసరమయ్యే కోర్సులకు కావలసిన ట్రైనింగ్ అందించేందుకు నెల్లూరులో ఒక సంస్థ ఆవిర్భవించింది. మదరాసు బస్టాండ్‌లోని ఎస్.వి.ఎస్. కాంప్లెక్స్‌లో ప్రారంభించిన ఈ బెన్స్ టోఫిల్ సెంటర్లో ఫారిన్ లాంగ్వేజ్, గ్రాడ్యుయేట్ మేనేజిమెంట్ అడ్మిషన్ టెస్ట్, స్టాటిస్టిక్ ఇన్స్టిట్యూట్ టెస్ట్ వెళ్లే విద్యార్థీ విద్యార్థులకు శిక్షణ ఇస్తారు. ఈ సంస్థకు ఎం.ఫిల్ చేసిన శ్రీమతి గ్రేస్ అవిత కో ఆర్డినేటర్‌గా వ్యవహరిస్తున్నారు.

### మూడేళ్లుగా పూర్తి కాని బ్రిడ్జి

టౌన్‌లో ఒకటవ వార్డు జనార్ధన రెడ్డి కాలనీ పోయేందుకు దారికి అడ్డుగా వున్న కాలువ పై నిర్మించ తలపెట్టిన బ్రిడ్జి పనులు నత్త నడకన సాగుతున్నాయి. ఈ కాలువ పై బ్రిడ్జి నిర్మాణానికి 90 లో జరిగిన మునిసిపల్ కౌన్సిల్ సమావేశంలో 14 లక్షల రూపాయలు మంజూరు చేశారు. టెండరు ఎప్పుడో పిలిచినా ఇంత వరకూ కాంట్రాక్టర్ పని మొదలు పెట్టలేదు. ఇటీవల వర్షాలకు ఆ కాలువ పొంగడంతో కాలనీలోకినీరు ప్రవహించి ప్రజలు రావడానికి మార్గం లేకుండా పోయింది. కొంత మంది ధైర్యం చేసి కోవూరు

థర్మల్ స్టేషన్ వైపు పోయే పైపు లైను మీదుగా ధైర్యం చేసి సర్కస్ ఫీటు చేస్తూ నడిచి వస్తున్నారట. పొరపాటున కాలు జారితే కాల్వలో పడి కొట్టుక పోవడం ఖాయం. బయటకు రాలేక మహిళలు పిల్లలు నీటితో నిండిన కాలనీలో పడరాని పాట్లు పడుతున్నారని ఒకటవ వార్డు

### ఇరవైకోట్లు

( 4 వ పేజి కొరవ )

హాల్‌లో ఏర్పాటు చేసిన ఫోటో ప్రదర్శనను తిలకించారు. రాపూరు, వెంకట గిరి శాసన సభ్యులు మినహా జిల్లాలోని మిగతా శాసన సభ్యులంతా సమావేశంలో పాల్గొన్నారు. అంతకు ముందు మంత్రులు జిల్లా కలెక్టర్‌తో కలసి మునిసిపాలిటీ పరిధిలో దెబ్బ తిన్న రోడ్లు, ముదివర్తి పాళెం పెన్నానది పొర్లు కట్ట, నీట మునిగిన వరి పైర్లు నారుమడులను చూసి వచ్చారు.

### రామిరెడ్డి

( 4 వ పేజి కొరవ )

ఇంటర్నేషనల్ అధిపతి శ్రీ పి. ఓబుల రెడ్డిని, శ్రీ ఏనుగు అనంత పద్మనాభ రెడ్డిని అభినందించారు. సన్మాన గ్రహీతలలో ఒకరైన సాహితీ వేత్త శ్రీ నాగభైరవ కోటేశ్వర రావును డాక్టర్ బెజవాడ గోపాల్ రెడ్డి సన్మానించారు. మరో సన్మాన గ్రహీత శాస్త్రవేత్త డాక్టర్ ఎం. విజయ లక్ష్మి సందేశాన్ని ఆమె సోదరి లెక్చరర్ ఎం. గిరిజ చదివి వినిపించారు. వేద సంస్కృత కళాశాల ఆంధ్రోపన్యాసకులు శ్రీ చంద్రశేఖర రెడ్డి ప్రార్థనతో ప్రారంభమైన సభను సమాజం అధ్యక్షులు శ్రీ పి.వి. రమణారెడ్డి స్వాగతించగా సభ్యులు శ్రీ అగస్త్యరెడ్డి వెంకురెడ్డి వందన సమర్పణ కావించారు.



# దేశంలో అత్యుత్సాహం- కాంగ్రెస్‌లో నీరసం!

రాష్ట్ర రాజకీయాల్లో విచిత్రమైన పరిస్థితి నెలకొన్నది. అధికారంలో వున్న కాంగ్రెస్ పార్టీ తమ అధికార పీఠం కదిలిపోతోందన్న భయాందోళనలకు గురవుతుండగా, ప్రతిపక్ష పార్టీయైన తెలుగుదేశం మరో ఏడాదిలో అధికారం తమహస్తగత మవుతుందన్న మితిమీరిన ఆత్మవిశ్వాసంతో వుంది. ఎన్నికలు మరో ఏడాది వుండగా ఇలాంటి పరిస్థితి నెలకొనడానికి కాంగ్రెస్ పార్టీయే కారణమని చెప్పక తప్పదు. నేదురుమల్లి జనార్దన రెడ్డి ముఖ్యమంత్రి పీఠం నుంచి తప్పుకున్నాక కాంగ్రెస్ ఎమ్మెల్యేల్లో ఎందుకనో స్తబ్దత నెలకొంది. కోట్ల విజయభాస్కర రెడ్డి వంటి సీనియర్ నాయకుడితో 'మసలు' కునే విషయంలో ఎమ్మెల్యేలు వెనకడుగేస్తున్నారు. ముఖ్యమంత్రి కూడా 'రిజర్వ్‌డ్' టైప్ కావటంతో ఎమ్మెల్యేలు అధికార అంతఃపురానికి దూరమైపోయారు. గతంలో జేబునిండా పైరవీ చీటీలతో ముఖ్యమంత్రి ఇంటి చుట్టూ తిరిగే ఎమ్మెల్యేలు గత ఏడాదిగా చీటీలు ఖర్చుకాక తెగ ఇబ్బంది పడిపోతున్నారు. దీంతో 'పనులు' కావటం లేదని, పరిస్థితి ఇలాగే వుంటే వచ్చే ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ చాపచుట్టేయటం ఖాయమని ప్రచారం చేయడం మొదలెట్టారు. ఏడాదిగా ఈ రకమైన ప్రచారం ఊపందుకుంది. ఇటీవలి నల్గొండ, రాజమండ్రి తెలుగుదేశం సదస్సులకు లక్షలాది జనం హాజరు కావటంతో సహజంగానే తెలుగుదేశం పార్టీలో ఉత్సాహం చోటుచేసుకున్నది. కాంగ్రెస్ పార్టీ 'పనైపోయింది' అంటూ జరుగుతున్న ప్రచారానికి తెలుగుదేశం సభల విజయోత్సాహం బలం చేకూర్చింది. అయితే నిజంగానే ఈ పరిస్థితి వుందనడానికి దాఖలాలేమీ లేవు. కాంగ్రెస్ పార్టీని ప్రజలు ఛీకొట్టేస్తున్నారని ఎమ్మెల్యేలు, పదవులు రాని ఇతర ఛోటా నాయకులు చెబుతున్నారే తప్ప అలాంటి వాతావరణం ఏదీ ఏర్పడ లేదు. తెలుగుదేశం పార్టీ సభలకు జనం వస్తున్నారంటే ఆ పార్టీ నాయకులు, ఎమ్మెల్యేలు, కార్యకర్తల ''కృషి'', ఇటీవలే 'దేశం' లో ప్రవేశించిన నూతన పాత్ర 'లక్ష్మి పార్వతి' ని చూడాలన్న కోరిక 'దేశం' సభల్ని జనంతో ముంచెత్తుతున్నాయి. ఇలావుండగా సాక్షాత్తు పిసిసి అధ్యక్షుడు మర్రి తులసీదాస్ ఇటీవల ఒక ప్రకటన చేస్తూ ''కాంగ్రెస్ పార్టీ బలహీనత వల్లే తెలుగుదేశం పార్టీ సభలకు లక్షలాది జనం హాజరవుతున్నారని'' మరికొంత ఆజ్యం పోశాడు. ముఖ్యమంత్రి కూడా అస్మదీయుల ప్రచారానికి బెంబేలెత్తిపోయి త్వరలోనే పార్టీ ప్రాంతీయ సదస్సులు నిర్వహించి పెద్ద ఎత్తున జన సమీకరణ చేయాలని నిర్ణయించారు. ఇటీవల మంత్రిమండలి సమావేశంలో కూడా ముఖ్యమంత్రి తన మంత్రి వర్గ సహచరుల్ని మందలిస్తూ 'కేవలం నియోజక వర్గాలకే పరిమితం

## హైదరాబాదు వార్తా కథనం

కాకుండా జిల్లా మొత్తం తిరిగి ప్రభుత్వ కార్యక్రమాల్ని ప్రచారం చేయాలని ఆదేశించారు.

జిల్లా మంత్రులు, ఎమ్మెల్యేలు డిసిసిలను పట్టించుకోవడం లేదు. వైరాగ్యంలో మునిగిన డిసిసి అధ్యక్షులు ఇటీవల ముఖ్యమంత్రిని కలిసి తమగోడు విన్నవించుకున్నారు. దీనికి స్పందించిన ముఖ్యమంత్రి మంత్రి వర్గ సమావేశంలో మాట్లాడుతూ ' మంత్రులంతా విధిగా డిసిసి కార్యాలయానికి వెళ్లి కార్యకర్తల్ని కలుసుకోవాలని హుకుం నామా జారీ చేశారు. దీన్ని ఎంత మంది మంత్రులు అనుసరిస్తారో వేచి చూడాల్సిందే.

## కథక గండరగండ రాచకొండ

— రసిక్

ఆంధ్రసాహితీ వినీలాం బరం నుండి
కెంపు కాంతులు విరజిమ్మిన మరోతార
క్షితిపైకి తటాలున రాలిపోయింది.
పఠితల మనోక్షేత్రాలను దున్నిదున్ని
అలసి అలసి ఆగిపోయిందేమో
రౌహిణేయుని హలం వంటి రాచకొండ కలం
రాచరికపు పరపీడన పరాయణత్వానికి
దాని కొమ్ము కాసే వ్యవస్థల అమానుషత్వానికి
కొండలా ఎదురు నిలిచిన రాచకొండను సైతం
పిండిగా మార్చేసింది మృత్యువనే అశని పాతం.

* * *

ఈతరం కథకుల్లో ప్రముఖుడు
కథకులకే కథకుడు
కథక గండర గండడు
తన కథలను మనహృదయాంతరాలకు పంపివేసి
పంపి వేశాడు తన బ్రతుకు కతను కంచికి.

* * *

విజయవాడ పెద్దాయన 'విశ్వనాథ'
విశాఖ పెద్దాయన 'విశ్వనాథ'
మొదటి విశ్వనాథ ఇంటిపేరు
రెండవ విశ్వనాథ అసలు పేరు

* * *

ఆయన 'హరితత్త్వమున్న' కవి
ఈయన 'హరతత్త్వమున్న' కథకుడు
హరిహరులిరువురూ విశ్వనాథులే
అరసిన వారికి అంతే అద్వైతమే

* * *

విశాఖ అంటే ఒక కవి, ఒక కథకుడూ;
కవి అంటే
'అగ్గిపుల్లా, కుక్కపిల్లా, సబ్బుబిళ్ళా'
అని సూత్రీకరించిన కవి; కథకుడంటే
ఆ సూత్రానికి తన కథలతో భాష్యం చెప్పిన కథకుడు;
ఆ కవికి శబ్దం మీద అపారమైన అధికారం
ఈ కథకునికి మాండలికం మీద అమోఘమైన మమకారం;
ఈ యిరువురి మృదంగ విన్యాసంతో
పులకించింది తెనుగునాడు నాడి
పెల్లుబికింది తెనుగువాడి వాడి

* * *

నిస్సహాయుల వైపు నిరంతరం నిలుస్తూ
అట్టడుగు వర్గాల అభ్యున్నతికై అహరహం ఆక్రోశిస్తూ
రెక్కాడినా డొక్కాడని రిక్తజీవుల
రక్తం నుండి కల్మిని పండించుకునే
సకల శక్తులనూ జనశక్తిని గూర్చి హెచ్చరిస్తూ
అంతర్హితమైన ఆ అద్వితీయ కథన శక్తికి
అర్పిద్దాం మన జోహారులు
అర్పిద్దాం మన నివాళులు !!!

# పైలట్ సాహసోపేత నిర్ణయం తీసుకోకుంటే 250 మంది ప్రాణాలు హరీమని వుండేవి!

(మొదటి పేజీ తరువాయి)

కిలో మీటరు దూరం బురదలో ఈడుకొంటూ వెళ్లి, నిల్చిపోయింది. ఆ రాపిడికి విమానం ముందు భాగం తుక్కు తుక్కు అయిపోయింది. ఇంజన్ పరికరాలు, రెక్కలలో నుంచి కొన్ని విడి భాగాలు, రెండు కిలో మీటర్ల దూరం ఎగిరి పడ్డాయి. తోక భాగం మాత్రం గాలిలోకి నిటారుగా లేచి నిలబడింది.

నాయుడుపేట సమీపంలో చెట్ల చిటారు కొమ్మల ఎత్తుకు ఎగిరే దశకు వచ్చినంత వరకు పైలట్, లోపలున్న ప్రయాణీకులకు కాని విమానమెంత భయంకర ప్రమాదంలో పడబోతున్నదీ సిబ్బందికి కాని చెప్పలేదు. ఒక ప్రయాణీకుడు మాత్రం కిటికీలో నుంచి తొంగి చూసి, నేలకు అనుకున్నట్లు ప్రయాణిస్తున్న విమానాన్ని కనిపెట్టి ఏదో జరగబోతుందని కేక పెట్టాడట. అతడు అరవడం, పైలట్ అత్యవసర ల్యాండింగ్ ప్రకటన చేయడం, విమానం క్రిందకు దిగి నిల్చిపోవడం సెకండ్ల తేడాతో జరిగి పోయింది.

పైలట్ హెచ్చరికను విన్న ఎయిర్ హోస్టస్‌లు, లోపల వున్న ఇతర వైమానిక సిబ్బంది మెరుపు వేగంతో ఎమర్జెన్సీ ద్వారాలు తెరిచారు. ఎమర్జన్సీ ద్వారాల దగ్గర రబ్బరుతో చేసిన జారుడు బండల వంటి ఛూట్‌లు వుంటాయి. కేవలం 90 సెకండ్ల వ్యవధిలో 247 మంది ప్రయాణీకులు, సిబ్బంది వాటి మీదుగా జారి, క్రిందకు దిగి, దూరంగా పరుగెత్తి పోయారు. ఆ సమయానికి పెట్రోలు ట్యాంక్‌లో 100 లీటర్ల ఇంధనం కూడా లేదు. అందువల్ల ఇంత రాపిడికి మంటలు లేయలేదు. పొలాలు దున్నడానికి వచ్చిన ట్రాక్టర్ మాదిరి విమానం నిలబడి పోయింది. ప్రయాణీకులందరూ సురక్షితంగా క్రిందకు దిగేశారు. ఇద్దరికి తప్ప ఎవ్వరికీ చిన్న గాయం కూడా కాలేదు.

ఆ క్షణాలలో మద్రాసు విమానాశ్రయంతో పాటు, చుట్టు ప్రక్కలుండే వైమానిక, నావికా దళం కేంద్రాలకూ ఈ వార్త అందింది. వారి హెలికాప్టర్లు, చిన్న విమానాలు వెతుక్కుంటూ పరుగెత్తుకొని వచ్చాయి. వైమానిక దళం హెలికాప్టర్లు అందరికంటె ముందుగా ప్రమాద స్థలాన్ని పసికట్టి, మద్రాసుకు సమాచార మందించి, గాయపడిన ఇద్దరిని ఎక్కించుకొని బెంగుళూరుకు




నేల కూలిన లోహ విహంగావాన్ని చూడను వేలం వెర్రిగా పరుగు లెత్తుక వస్తున్న జన సందోహం.

హుటాహుటిన తరలించాయి. ఒక గంట వ్యవధిలో తిరుపతి, కాళహస్తి వెంకటగిరి వగైరా ప్రదేశాల నుంచి పోలీసులా వచ్చారు. వెంకటగిరిలోని పోలీసు బెటాలియన్ సభ్యులు పరుగు పరుగున ప్రమాద స్థలానికి చేరుకున్నారు; మధ్యాహ్నానికి కలెక్టరాది అధికారులు, తిరుపతి విమానాశ్రయం నిర్వాహకులు వచ్చారు.

ప్రయాణీకులందరినీ తిరుపతికి తరలించి అక్కడి నుంచి వారి వారి ఊళ్లకు పంపారు.

పైలట్ సమయస్ఫూర్తితో ఆ నిర్ణయం తీసుకొని వుండకపోతే, తిరుపతికో, మద్రాసుకో వెళ్లి విమానాశ్రయంలో దించడానికి ప్రయత్నించి వుంటే మధ్యలోనే విమానం ఆకాశం నుంచి విసిరేసిన ఇనుప గుండువలె నేలకు రాలి వుండేది. కాను బ్రద్ధలు బ్రద్ధలు కావడంతో పాటు లోపలున్న వారినందరినీ మసిచేసి వుండేది. విధి అనుకూలించి, భగవంతు డనుగ్రహించి ప్రయాణీకులను కాపాడాడు. ఒళ్లు గగుర్పొడి, రోమాలు నిక్కబొడుచుకొనే మహాసాహస క్రియగా ఈ సంఘటన విమానయాన చరిత్రలో నిల్చిపోతుంది.

## వందకోట్లు బుగ్గిపాలు

వెంకటగిరి సమీపంలో కూలిపోయిన ఎయిర్‌బస్ ఎ-300 విమానం ఖరీదు వందకోట్లు. 1976 లో ఫ్రాన్సుకు చెందిన ఎయిర్ బస్ ఇండస్ట్రీస్ నుంచి ఈ విమానాన్ని కొనుగోలు చేశారు. ఈ పదిహేడేళ్లలో ఈ విమానం 40 వేల గంటల పాటు ఆకాశంలో విహరించింది.

బలవంతంగా క్రిందకు దింపడం వల్ల దీని రెండు ఇంజన్లూ దెబ్బతిన్నాయి. ఎలక్ట్రానిక్ పరికరాలు పనికి రాకుండా పోయాయి. ముందు భాగంలో ఇంజన్లను కప్పి వుంచే కవర్ చిరిగి పోయింది. చక్రాలు విరిగిపోయాయి. రెక్కలు కదిలి పోయాయి. విమానాన్ని అక్కడ నుంచి కదిలించి, తీసుక వెళ్లి రిపేరు చేయడం అసాధ్యం. అది పాత ఇనుము క్రిందే లెక్క. వందకోట్ల ఖరీదైన విమానం ఒక్క నిముషంలో తుక్కుగా మారిపోయింది.

విమానం వెనుక భాగంలో వుండే అరలో లోడ్ చేసిన ప్రయాణీకుల సూట్‌కేసులు, ఇతర సామాన్లు వెలికి తీసి వారికి ఇచ్చేశారు. ముందువైపు వుండే అర బురదలో కూరుక పోవడం వల్ల అక్కడి సూట్‌కేసులు తీయడం అలివి కావడం లేదు. ఆ భాగంలో రెండున్నర టన్నుల లగేజి వుందని అంచనా.

# ముఖ్యమంత్రి పదవీ పరిత్యాగం?

## రోశయ్య తాపత్రయం ═══ బి.సి. నాయకుల ఉబలాటం!

ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి పదవి పరిత్యాగం చేయాలనే ఆలోచనలో వున్నారా? ముళ్ల కిరీటాన్ని ఎంత త్వరగా వీలైతే అంత త్వరగా వదిలించు కోవాలని చూస్తున్నాడా ?

నాలుగైదు రోజుల నుంచి ముఖ్యమంత్రి ఇంట గుసగుసల రూపంలో గుప్పు మంటున్నాయీ వదంతులు. వీటిని పట్టి పుకార్లుగా కొట్టిపారేయ డానికి వీలు లేదు. ముఖ్యమంత్రి అంతరంగ భావ వీచికలుగా భావించాలి ! విజయభాస్కర రెడ్డి గారు ఇటీవల కొంత కాలంగా, మరీ ముఖ్యంగా తెలుగుదేశం మినీ మహానాడులు ముగిసిన నాటినుంచి తీవ్రమైన ఆందోళనతో కన్పిస్తున్నారు. ఏడాది క్రితం పదవి ప్రమాణ స్వీకారం చేసేటప్పుడు - 1983 నాటి చారిత్రక తప్పిదం తిరిగి తన చేతే సరిదిద్ద బడే అవకాశం వచ్చిందని సంతోష పడ్డారాయన. తన చేతితో తెలుగు దేశానికి అధికారం అప్పగించానన్న ఆవేదన ఆయనలో ఎప్పుడూ వుంది. రెండేళ్ల పరిపాలనలో ఆ నింద తొలగదీసు కోవచ్చని ఆశ పడ్డారు. కాని ఇప్పుడు పరిస్థితి వేరుగా వుంది. కాంగ్రెస్ ఎమ్మెల్యేలే, మళ్లీ పార్టీ గెల్చే అవకాశం లేదన్న నిస్పృహలో వున్నారు. పార్టీ రోజారోజుకీ ఛిన్నాభిన్న మౌతున్నది. కార్యకర్తలలో ఉత్సాహం లేదు. తెలుగు దేశం రాజమండ్రి, నల్గొండలలో నిర్వహించిన మినీ మహానాడులలో జనం తండోప తండాలుగా తరలి రావడం ఆయన్ను పునరాలోచనలో పడవేసింది. ఎన్నికల వరకు కొనసాగి, పార్టీ ఓటమికి గురైతే ఈ ముదిమి వయస్సులో పార్టీని పతనం చేసిన వాడిగా నింద అనుభవించవలసి వస్తుందని ఆయన భయ పడుతున్నారు. ఆ అవమానం కంటె, ఇప్పుడే మర్యాదగా, పెద్ద మనిషి తరహాగా పదవి నుంచి తప్పుకొని, ఢిల్లీకి వెళ్ళి పోవడం ఉత్తమ మన్నది ఆయన ఆలోచన. ఢిల్లీలోనూ ఉత్తరాది రాష్ట్రాల ఓటమి ఫలితంగా తనపై వచ్చే వత్తిడి నుంచి తట్టు కోవడానికి కోట్ల వంటి సీనియర్ సహచరుల అవసరం పివికి ఎంతో వుంది.

ఒకరిద్దరు అంతరంగికుల దగ్గర ముఖ్యమంత్రి ఈ అభిప్రాయాలు వెల్లడి చేయడంతో, తదుపరి నాయకత్వం తమకే రావాలన్న తహతహ సీనియర్ మంత్రులలో మొదలైంది. అందరికంటే, ఆర్థిక మంత్రి శ్రీ కె. రోశయ్య ఒక అడుగు ముందుకు వేసి బలాన్ని కూడ గట్టే ప్రయత్నం చేస్తున్నారు. పివికి ముఖ్యులనుకున్న వారిని పిలిపించుకుని తన అర్హతలు వివరిస్తున్నారు.

**1983 లో వలె మళ్లీ తన చేతుల మీదుగా తెలుగుదేశానికి అధికారం అప్పచెప్పే దురదృష్ట పరిస్థితి ఎదురౌతుందనే భయంతో కోట్ల వారు కుర్చీ ఖాళీ చేసి ఢిల్లీకి వెళ్లడానికి దారులు వెతుకుతున్నారు!**

ఎన్నికలకు ఇంకా ఏడాది వ్యవధి మాత్రమే వుంది కాబట్టి, ఎమ్మెల్సీలను ముఖ్యమంత్రి చేయడం రిస్కు అవుతుంది. ఆరు నెలలలోగా ఎమ్మెల్యేగా గెలవడాని కను కూలంగా శేషన్ ఉప ఎన్నిక జరిపిస్తాడన్న నమ్మకం లేదు. అందువల్ల శాసన సభ్యులలో ఒకరిని ఎంపిక చేయక తప్పదు. ఆ ఒకరూ తనే ఎందుకు కాకూడదన్నది రోశయ్య అంతర్యం.

అయితే కొందరు బిసి నాయకులు తమ కనుకూలమైన వారిని ప్రచారంలోకి తెస్తున్నారు. 1989 ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీ గెలుపుకు కారకులైన వెనుక బడిన తరగతుల వారు వివిధ కారణాల వల్ల పార్టీకి దూరమై పోతున్నారు. వర్గ ద్వేషమే అన్నంత తీవ్రంగా తెలుగు దేశంలో విభేదించిన వారూ ఇప్పుడు ఆ పార్టీ పట్ల సానుభూతితో మాట్లాడు తున్నారు. ఇంకొక ప్రక్క చిరంజీవి భయం వుండనే వుంది. ఆ కొత్త పార్టీ గనుక వస్తే బిసి లందరూ కలసి కట్టుగా కాంగ్రెస్‌ను వదిలి పోయే ప్రమాదం వుంది. ఈ పరిస్థితులలో ఒక బిసి నాయకుడికి పదవి అప్పచెబితే, ఆ వర్గాలలో కాంగ్రెస్ పట్ల సానుకూలత వ్యక్తమౌతుందని, పార్టీ గెలుపుకు అదెంతో ముఖ్యమని వారు వాదిస్తున్నారు. విజయభాస్కర రెడ్డి తనంతట తానుగా వెళ్లక పోయినా, అధిష్టాన వర్గం ఒక నిర్ణయం తీసుకొని మార్పు చేయాలన్నది వీరి ప్రచారం.

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.,